

తాత్వికభావాల తన్మయత్వం

# బివివి ప్రసాద్

కవిత్వం

సౌభాగ్య

TAATVIKABHAAVAALA TANMAYATVAM
BVV PRASAD KAVITVAM
an anthology of essays

by SOUBHAGYA



First Edition : August, 2016, Copies : 500
For Copies :
Visalaandhra Book House, Prajashakti Book House,
Navodaya Book House and all leading book shops
in Andhra Pradesh and Telangana
Printing :
CHINUKU Publications
Gandhinagar, Vijayawada - 520 003
Cell : 98481 32208

Rs. 60/-

## ఇకపై పేజీల్లో ..

# బివివి ప్రసాద్ కవిత్వం - నేను

**బివివి ప్రసాద్‌గారు** ఎప్పటినించో నాకు తెలుసు. ఆయన నిర్మలమయిన మనిషి. నిశ్శబ్ద ప్రేమికుడు. నిశ్శబ్దసరస్సులో పద్మాల్లా వచ్చిన ఆయన కవితలు తెలుగు కవితా ప్రియులందర్నీ ఆకర్షించాయి. ఆయన తాత్వికుడు! ప్రచారకుడు కాదు. సిద్ధాంతాల్ని మోసేవాడు కాదు. బరువు దించుకోవడంలోని బ్రహ్మానందాన్ని తెలిసినవాడు. తన భావనా శకలాల్ని వదిలి ఎందరో మనసుల్ని మైమరపించినవాడు.

అట్లాగే నన్నూ ఆనందపెట్టినవాడు. మా ఇద్దరి మధ్యా కమ్యూనికేషన్ వుంది. తక్కువ మాట్లాడుకున్నా ఎక్కువ సాన్నిహిత్యముంది. రెండు మూడుసార్లు కలుసుకున్నాం. ముచ్చటించుకున్నాం.

ప్రసాద్ పూర్తిపేరు బొల్లిన వీర వెంకట ప్రసాద్. సంక్షిప్తంగా బివివి ప్రసాద్. నేను, ఏడవ తరగతి అనుకుంటాను, చదివేరోజుల్లో యాభయి సంవత్సరాలక్రితం మాకు ఒక ఉపవాచకం వుండేది. దాంట్లో ఇద్దరి జీవితాల గురించి చదువుకున్నాను. ఒకటి కట్టమంచి రామలింగారెడ్డిగారు. ఆయన సాహిత్యకారుడు గనక తెలుసు. ఇంకోవ్యక్తి బొల్లిన మునుస్వామినాయుడు. ప్రసాద్ ఇంటిపేరు చూస్తూనే ఆయన గుర్తొచ్చాడు. ఆయన అప్పట్లో ఇంగ్లాండ్ వెళ్ళి చదువుకున్నాడు, అవిభక్త మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేశాడు.

ప్రసాద్‌లోని 'సున్నితగుణం, లోతైన అన్వేషణ, నిజాయితీ' నాకు నచ్చాయి. కొంతమేరకు ప్రసాద్‌గారికిలాగే నాకూ తాత్వికదృష్టి వుంది. కవితాదృష్టి వుంది. ఎప్పటినించో ప్రసాద్‌గారిపై పుస్తకం రాయాలనుకుంటున్నాను. ఇప్పటికది కార్యరూపం దాల్చింది.

# ఆరంభం నుంచే ఆంతరిక ప్రయాణం

**బివివి ప్రసాద్** ఇరవైమూడేళ్ళ వయసులో తన మొదటి కవితా సంపుటి 'ఆరాధన' తీసుకొచ్చాడు. ఆ పుస్తకాన్ని రమణమహర్షికి అంకితమిచ్చాడు. 'నిన్ను నీవు తెలుసుకో అని ప్రబోధించిన శ్రీ రమణమహర్షికి ఈ పుస్తకం అంకితమిస్తున్నాను' అన్నాడు.

అంటే యవ్వనపు తొలి రోజుల్లోనే అతనిలో ఆధ్యాత్మికబీజాలు పడ్డాయి. జీవితాన్ని అన్వేషించడం మొదలయింది. ప్రాపంచిక జీవితానికి ఒక క్రమం వుంటుంది. దాంట్లో కొన్ని దశలుంటాయి. కాళిదాసు ఇలా అన్నాడు..

'శైశవేభ్యస్త విద్యానాం
యౌవనే విషయేషి నాం
వార్ధక్యే ముని వృత్తీనాం
యోగే నాన్తే తనూత్యజాం'

అంటే యౌవనం కాంక్షలతో అల్లకల్లోలమయ్యే దశ. ప్రపంచం తనకోసం పరిచిన పచ్చ తివాచీ అని ప్రతి యవ్వనంలోని వ్యక్తీ అనుకుంటాడు. వీలయినంతగా భౌతిక సుఖాల్ని జుర్రుకుంటాడు.

ప్రసాద్ వేరు. అతని యవ్వనం వేరు. అతనిలో ఒక చింతన వుంది. ఒక భావన వుంది. అది భౌతికంకాదు. ఆదిభౌతికం, ఆధ్యాత్మికం. తన సమస్త యవ్వన శక్తినీ అతను సృష్టి రహస్యం మీద కేంద్రీకరించాడు. ఆకాశాన్ని, భూమిని, సమాజాన్ని పరిశీలిం చాడు. అతను ప్రకృతి పరిశీలకుడు, పరిశోధకుడు. లోపలికి వెళ్ళి అన్వేషించేవాడికి లోకంతో పనిలేదు. బహుశా అతని సుకుమారతత్వం ఆత్మాన్వేషణ వైపు మళ్ళించిందేమో. అతని వాక్యాలన్నిటా ప్రకృతి విస్తరించింది. మానవులకన్నా మనతో ఘర్షించని మేఘాలు, పూలు, గాలి, వాన, పక్షులు వంటి వస్తువులే వ్యాపించాయి.

ఆత్మాన్వేషణకి ఏకాంతం కావాలి. సంఘర్షణకు దూరంగా వుండాలి. సమాజానికి సాధ్యమయినంత దూరంగా వుండాలి. మనసు తేలిక పడాలి. తేట పడాలి. అప్పుడే సత్యం సరళంగా ముందుకొస్తుంది.

పాతికేళ్ళు దాటని కవిత్వంలో అమ్మాయిలు, ఆవేశాలు, విప్లవాలు, తిరుగుబాట్లు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు చోటు చేసుకోవాలి. ప్రసాద్ కవిత్వంలో ఇవేవీ లేవు. ఒక మౌనతపస్సు చేసే భావుకుడిలో విచ్చుకున్న పూలు, అతీత స్థితికి చెందిన ఆలోచనల పరిమళాల్ని మనకు అందిస్తాయి.

తెలుగు కవుల్లో అసాధారణుడు, అద్వితీయుడు, తాత్విక తీరాల్లో స్వేచ్ఛగా విహరించేవాడు ప్రసాద్.

'సామ్రాజ్యాలని జయించినా కీర్తి విస్తరిల్లినా
చిరుగాలికి ఊగే పచ్చగడ్డి మీది నుంచి జారిపడే
మంచు బిందువును చూసి మౌనంలోకి పడకపోతే
జీవితపు విలువలు తెలియవు'

ఏమిటిది? ఇరవైరెండేళ్ళ కుర్రాడు ఒక వైరాగ్య వీచికను మనపై వదుల్తున్నాడు. పట్టలేని పరవశంతో ప్రగల్భించాల్సిన వయసులో పరమ సాత్వికంగా 'పద్మపత్ర మివాంభస' లాగా అంటీముట్టని అతీత మానసస్థితిని ప్రదర్శిస్తున్నాడు. ఇది నిజంగా ఆశ్చర్యం, అద్భుతం. ఏ ప్రాచీన పరిమళం అతన్ని పట్టుకున్నదో, వూహ తెలిసిననాడు అతని మనసులో అజ్ఞాత వైరాగ్యబీజం పడింది. ప్రాపంచిక సుఖాల పట్ల వైముఖ్యం ఏర్పడినట్లనిపిస్తుందని అనడం కన్నా ప్రాపంచిక పరిమితుల్ని, సుఖాల క్షణికత్వాన్ని గుర్తించినట్లనిపిస్తుంది. వాటిని దాటింది ఏదో వుంది. అది అనంత సత్యం, అనవగతం. అట్లాంటిదాన్ని అనుభవానికి తెచ్చుకునే తపన కనిపిస్తుంది.

తినడం, పడుకోవడం, లేవడం, నిత్యనైమిత్తికాల్లో పడడం, వీటి స్పృహ అతనికి వుండదు. అదీ ఎప్పుడో గుర్తుకు వస్తుంది.

'నా మౌనం అరణ్య నిశ్శబ్దాన్ని తాకినపుడు
నా నిట్టూర్పు కెరటాలచే ఆహ్వానించబడినపుడు
నేను జీవించే ఉన్నానని నాకు స్పష్టమైంది'

ఒక అరణ్య నిశ్శబ్దాన్ని అతని మౌనం తాకినపుడు ఒక అజ్ఞాత సంచలనం ఏర్పడింది. నిట్టూర్పు కెరటాలచే ఆహ్వానింపబడినపుడు నేను జీవించే వున్నానన్న స్పృహ కలిగిందట!

కొందరు 'జనన మరణాతీతం'గా జీవిస్తుంటారు. వాళ్ళను తాత్వికులంటారు. తాపసులంటారు. ఆధ్యాత్మిక వేత్తలంటారు. కవిత్వ పరిమళాల్తో ఆకర్షించే తాత్విక కవి, కవి తాత్వికుడు ప్రసాద్.

# ప్రకృతిలో పరవశించే కవి

**యవ్వనంలో** సాధారణంగా మిత్రుల్ని కలుస్తాం. రాత్రింబవళ్ళు విందులు, వినోదాలు, విహారాలు, సినిమాలూ, తిరగడాలు ఇంకా ఇతర అలవాట్లు, ప్రియురాలు, ప్రేమ, విరహం, ఇవే జీవితంగా కనిపిస్తుంది. చెరగని చిరునవ్వుతో, ఉరకలెత్తే ఉత్సాహంతో జీవితం ఎగిసిపడుతుంది!

ఆ వయసులో అనుక్షణం తన ఆత్మతృప్తిని, పువ్వు నవ్వులో, పిల్లగాలి చల్లదనంలో, వెన్నెల తాకిడిలో, నిశ్శబ్ద పర్వత దర్శనంలో నిమగ్నమయిన ప్రసాద్ గుంపుకు దూరంగా వున్నట్లనిపిస్తాడు. కానీ గుండెకు దూరంగా వున్నట్లనిపించడు. అతనికి పరవశ కేంద్రం ప్రకృతి. అన్వేషణే అతని రక్త నిష్ఠ గుణం.

'ప్రశ్నా పరంపరలతో నన్ను నేను వేధించుకొంటున్నపుడు
నన్ను తాకిన వాన చినుకు
ఆకాశంలో మెరిసే ఇంద్రధనుస్సును చూడమని చెప్పింది.
సప్తవర్ణాలలో నా చూపులు కరుగుతున్నపుడు
నన్ను గురించీ, ఇంద్రధనువు గురించీ ప్రశ్నించాలన్న ధ్యాసే
నా నుండి మాయమైంది'

ప్రకృతి స్పర్శ అతనికి కలిగేదాకా ప్రశ్నల పరంపరల్లోనే వున్నాడు. సందేహాలతో సంక్షుభితుడుగానే వున్నాడు. అయితే వానచినుకు తాకి ఆకాశంలోని ఇంద్రధనుస్సును చూడమని చెప్పిందట. సందేహాలతోనే ఇంద్రధనుస్సును సమీపించాడు. కానీ దాని దర్శనంలో ప్రశ్న అదృశ్యమయింది. ప్రకృతి ప్రశ్న కాదు. ప్రకృతి సమాధానం. ప్రకృతి పరిష్కారం. ప్రకృతిలో మనం పరమాణువులం. ఇక ప్రకృతిని ప్రశ్నించే సమస్య వుత్పన్నం కాదు కదా!

ప్రసాద్ ఒంటరివాడు కాదు, ఏకాంతజీవి. ఒంటరితనమంటే దిక్కుతోచని తనం. ఏకాంతమంటే ప్రశాంతత. సమాధానంలో విశ్రాంతి పొందడం. అతనూ మనిషే, అతనికీ స్నేహితులు, అనుభూతులు అన్నీ వున్నాయి.

'ఉదయం వికసించింది. పుష్పాలు రేకులు విప్పాయి
తుమ్మెద వాలింది. గాలి తెర కదిలింది
నన్ను ఎరిగిన మిత్రుడు, నన్ను చూసి చిరునవ్వు నవ్వాడు'

అంటే అతని ఆంతర్యం తెలిసిన స్నేహితుడున్నాడు. ప్రకృతితో అతని అనుబంధం అతనికి తెలుసు. ఉదయాన్ని చూసి ఉల్లాసపడిన కవిని చూసి మిత్రుడు చిరునవ్వు నవ్వాడట.

ప్రసాద్ మనసులో ఒక స్త్రీమూర్తి వుంది. ఆమె ప్రేయసో, ఊహాసుందరో! కాని ఆమెకు తన బతుకును సమర్పించాడు.

'నా జీవితాన్ని పాలించే మహారాజ్ఞీ!
నీ రాకకోసం
నా హృదయమందిర కవాటాలు తెరిచి
నా నిండా వెలుగులు నింపుతాను.
సజీవ నిత్యచైతన్య ప్రకృతి సంపదకు
మన చిన్ని హృదయాల కలయిక
మణి కిరీటమై నిలవాలి.
కాల ప్రవాహం వెంట సాగే
సాధారణ జీవనగమనం నుండి వేరు పరచి
మన ప్రేమ మనలను
నక్షత్రకాంతిలో, అనంతత్వంలో,మౌనంలో నిలిపి ఉంచుగాక!'

అతని ప్రియురాలు వుంది. ఆమె జీవన సహచరే. కానీ, ఆమె ప్రాపంచిక పరిమితుల్ని దాటింది. సాధారణ జీవనానికి వేరయింది. వాళ్ళ ప్రేమ అనంతత్వంలో ఒక అవిభాజ్య భాగంగా వుండాలని ఆశిస్తున్నాడు.

అతని ప్రేయసి రక్తమాంసాలున్న, రాగద్వేషాలున్న వ్యక్తిగా కొన్నిసార్లు కనిపిస్తుంది. ఆమెపట్ల అతని అంతులేని ఆరాధనా కనిపిస్తుంది.

'వాగు ఒడ్డున నీ ధ్యానంలో కూర్చొన్నపుడు
నీ మృదుగమనమూ, కలభాషణమూ, నిర్మల హృదయమూ
మరింత స్పష్టంగా దర్శించగలిగాను'

ఆమె అపూర్వ సౌకుమార్యమూ, సున్నితత్వం, సౌందర్యం అతని పువ్వులాంటి మనసులో పుప్పొడిలా వుంటాయి. ఆమె ఈ ప్రపంచానికి చెందినదయినా ఆమెను తన భావుకత్వంతో స్వయంకల్పిత స్వర్గంలో ప్రతిష్ఠిస్తాడు.

# పునరుత్థానం

**బివివి ప్రసాద్** కవితాయాత్రలో హైకూల ప్రయాణం ఒక పునర్జన్మ లాంటిది. తన పూర్వ అభివ్యక్తి రీతిని వదిలి సంక్షిప్తంగా సౌందర్య ఆవిష్కరణ చెయ్యడం అన్నది ఆయన హైకూల ఆవిష్కరణ.

గొంగళిపురుగు సీతాకోక చిలుకలా మారడం లాంటిది ఆయన హైకూల రచన. విశ్లేషణ, వివరణ, పరిశీలన, అనుభూతి వీటితో నిండిన వాక్య విన్యాసం ఆయన వచన కవితల్లో కనిపిస్తుంది. అది సౌందర్యాన్ని వెంటబెట్టుకునే వుంటుంది. ఆ క్రమంలో ఆయన సుకుమార భావుకత్వం అలిసిపోవడం కూడా కనిపిస్తుంది.

హైకూ రచన వేరు. కొన్ని పదాలతో ఉన్నత తాత్విక భావాన్ని, అపూర్వ సౌందర్యాన్ని ఆవిష్కరించటానికి ఆయన హైకూ తనకు అనుకూలమయిన ప్రక్రియగా భావించాడు. సీతాకోకచిలుక ఒక పువ్వుపై వాలుతుంది. ఒక అల ఎవరో కదిలించినట్లు కదుల్తుంది. ఒక పువ్వు గాలికి తలవూపుతుంది. ఒక పిట్ట గాల్లోకి ఎగురుతుంది. ఆ దృశ్యాలు చాలు, వేటికవి హైకూల్లో అపూర్వ కళాఖండాలుగా రూపుదిద్దుకుంటాయి.

హైకూ అంటే ఏమిటో, హైకూ రచనలో సుప్రసిద్ధ కవులెవరో, ప్రసాద్ పరిశీలించాడు. వ్యాసాలు రాశాడు. దాని తత్వాన్ని సాధికారంగా ప్రదర్శించాడు. ఆకళింపు చేసుకున్నాడు. మన భాషకు, మన భావానికి అనుకూలంగా ఆ ప్రక్రియలో రచన చేశాడు.

హైకూ గురించి ప్రసాద్ అవగాహన ఆయన మాటల్లో కనిపిస్తుంది. ఒక ఇంటర్వ్యూలో ఆయన ఇలా వివరించాడు.

'హైకూ అంటే ఒక పదచిత్రం. ఆ పదచిత్రం మనసులో సున్నితమైన అనుభూతిని కలిగించాలి. ఆ అనుభూతి లోపల ఒక విధమైన మెలకువ లాంటిది కలిగిస్తుంది, సౌందర్యం పట్ల.

..హైకూకి ముఖ్యంగా ప్రకృతి మాత్రమే వస్తువుగా వుంటుంది.

..లోపలి ప్రపంచాన్ని ఆవిష్కరించటానికి సరైన మాధ్యమంగా ప్రకృతి ఒక్కటే కనిపిస్తుంది.

హైకూని అర్థం చేసుకోవటం కాదు, అనుభవించాలి.

ప్రశాంతమైన మానసికస్థితి ఉండడం దీనికి ముఖ్యమైన అర్హత'

ఇంకో సందర్భంలో 'మంచి హైకూ కవి కావటానికి ఒకరు ముందు కవి కావాలి, తరువాత కవి కాకుండా పోవాలి.

హైకూ కవికి ప్రపంచంపై ప్రేమ ఉంటుంది. ఉదాసీనత కూడా వుంటుంది.

హైకూ కవి అంతర్ముఖుడై వుంటాడు' అని చెబుతాడు.

ప్రసాద్ ప్రపంచం కన్నా ప్రకృతికి దగ్గరివాడు, దేన్నయినా హృదయంతో సమీపించేవాడు, ప్రశాంత స్థితిలో వుండేవాడు. అతను కవి. అంతేకాదు, కవికాకుండా పోగలిగిన సత్యదర్శనమున్నవాడు. అతనికి ఈ ప్రపంచమంటే చెప్పలేని ప్రేమ. కానీ, ఉద్వేగ జీవితం పట్ల ఉదాసీనత.

ఇన్ని లక్షణాలు వుండబట్టి ఆయన హైకూ కవి అయ్యాడు. తనకోసం హైకూ పుట్టిందన్నంతగా దాన్ని ఒడిసిపట్టుకున్నాడు. హైకూల రచనలో ఆయన పరిపూర్ణ మానవుడయ్యాడు.

జెన్‌తత్వం ఆధ్యాత్మికతకు కళను అద్దింది. సౌందర్యస్పర్శ నిచ్చింది. అందుకని ప్రసాద్‌కు అది సొంతమయింది.

# దృశ్యాదృశ్యం

హైకూల రచన ప్రసాద్‌కు ఒక స్వేచ్ఛ నిచ్చింది. ఒక స్వాతంత్ర్యాన్నిచ్చింది. అపూర్వమయిన ఆహ్లాదాన్నిచ్చింది. ఉత్తేజాన్నిచ్చింది. తన అనుభూతికి క్షణికమైన, శాశ్వతమైన ఒక నిర్మాణ శిల్పాన్నిచ్చింది.

ఒక దృశ్యం కంటబడుతుంది. దాన్ని క్షణంలో మనసు ఫోటో తీస్తుంది. అది హైకూ. మనసులో ఒక మెరుపు మెరుస్తుంది. దాన్ని మనకు అందిస్తే అది హైకూ. 'అల్పాక్షరముల అనల్పార్థ రచన' అన్నాడు తిక్కన. ఇది అలాంటిదే. హైకూలు అనంత వ్యాఖ్యానానికి ఆస్కారమిస్తాయి.

**'వర్షం**
**క్షణం పూచే నీటిపూలతో**
**ఊరు నిండిపోయింది'**

దూరంగా నిల్చుని వర్షం కురుస్తున్న వూరిని చూస్తే ఏమనిపిస్తుంది. బిందువు కింద పడినప్పుడల్లా పువ్వు విచ్చుకున్నట్లుంటుంది. అట్లాంటి పూలతో వూరు నిండిపోయింది. అలాంటి అలతిపదాల్లో అపూర్వ చిత్ర ఆవిష్కరణ.

కొన్ని హైకూల అనుభవం కేవలం దృశ్యాలకు పరిమితం కాదు. దాన్ని చిత్రించడం, ఆవిష్కరించడం సాధ్యం కాదు.

**'రంగుల పిట్ట**
**మనసు కాన్వాసుపై**
**రంగులు పులిమేస్తుంది'**

రంగులపిట్ట కనిపిస్తుంది. సప్తవర్ణ సంశోభితంగా వుంటుంది. దాన్ని మాత్రమే చిత్రిస్తే సగం హైకూని చిత్రించినట్లవుతుంది. ఎందుకంటే 'మనసు కాన్వాసుపై రంగులు పులిమేస్తుంది' అంటున్నాడు. మనసు కాన్వాసును ఎలా చిత్రిస్తాం. దాన్ని వూహల్లో మాత్రమే, అనుభూతిలో మాత్రమే ఆవిష్కరించుకోగలం.

**'దూరంగా దీపం**
**దానిని కాపాడుతూ**
**అంతులేని చీకటి'**

దూరంగా దీపం కనిపిస్తూ వుంటుంది. కానీ, దాని కాంతి మనదాకా వ్యాపించదు. దాని వునికిని తెలిపేంత వరకే మినుకు మినుకుమంటుంది. కానీ, దాన్ని మినహాయిస్తే అంతా అన్నిదిశలా అనంతమయిన చీకటి పరివ్యాప్తమయి వుంటుంది. కవి ఆ చీకటి దీపాన్ని ఆరిపోకుండా కాపాడుతుందంటాడు. ఇక్కడ వైరుధ్యాల సమ్మేళనముంది.

**'చలికి వణుకుతూ**
**కాలువలో**
**వంతెన'**

కాలువలో నీళ్ళు ప్రవహిస్తూ వుంటాయి. 'మోకాళ్ళలోతున' అక్కడ వంతెన వుంటుంది. ఆ వంతెన 'చలికి వణుకుతోంద'ంటాడు. వంతెన చలికి వణకడమా? అని మనం ఆశ్చర్యపోతాం.

జెన్‌తత్వంలో అచేతనాలలో కూడా ప్రాణస్పందన వుంటుంది. ఒక జెన్ రుషి తనను చూడడానికి వచ్చిన శిష్యుడు నిర్లక్ష్యంగా తన చెప్పుల్ని బయట వదిలి గురువుగారి గదిలోకి వచ్చాడు. చెప్పుల్ని వదలడంలో దాదాపు వాటిని కాళ్ళతో విసిరి కొట్టినంత పని చేశాడు.

గురువు శిష్యుని కసురుకొని 'వెళ్ళు, మొదట వెళ్ళి నీ పాదరక్షలకు క్షమాపణలు చెప్పి నా దగ్గరికి రా. అవి అనునిత్యం నీ పాదాల్ని కాపాడుతున్నాయి. నువ్వు వాటిపట్ల కృతజ్ఞత లేకుండా ప్రవర్తించావు' అంటాడు.

## 2

ప్రత్యణువులో ప్రాణస్పందన దర్శిస్తాడు ప్రసాద్.

హైకూ రహస్యానికి రంగులు పూస్తుంది. అజ్ఞాతానికి ఆనందాన్నద్దుతుంది. మార్మికతకు మందహాసాన్నిస్తుంది. అనంతశూన్యం నుంచీ ఆవిష్కారమయిన అంతులేని ఈ విశ్వానికి ఆకర్షణనిస్తుంది.

**'నేల రాలిన పూవు**
**అడుగుతోంది**
**నిన్న నా నవ్వు చూశావా?'**

అందరూ చూస్తారు. వాడినపూలను చూస్తారు. కొమ్మనుంచీ రాలి నేలమీద ఎండిన పూలను ఎందరో చూస్తారు. కన్నుమూస్తున్న ఆ పువ్వు పలకరింపును ఎందరు వింటారు? నిన్న ఎంత తాజాగా నవ్వులా నీ ముందు వున్నాను. అప్పటి నన్ను నువ్వు గుర్తు తెచ్చు కున్నావా? అంటుంది. కవి హృదయం నిన్నను చూస్తుంది. విచ్చుకున్న పువ్వును, వాడిన పువ్వును చూస్తుంది.

**'ఒకమూల వీణ**
**స్వరాల పూలను రాల్చి**
**విశ్రాంతిగా'**

ఇట్లాంటి హైకూ చదివితే ఒళ్ళు పులకరిస్తుంది. కొన్ని మాటల్లో మనమీద తేనె చిలకరించడం ప్రసాద్ నేర్చిన విద్య అనిపిస్తుంది. అంతదాకా వీణను వాయించారు. దృశ్యాన్ని వూహించుకోండి. సభికులున్నారు. సంగీతకారిణో, సంగీతకారుడో వీణావాదనతో

నిరంతర పూల వర్షంతో సభికుల్ని తన్మయపరచింది. ఇప్పుడు దృశ్యం వేరు. వీణ గదిలో ఒక మూల ఒంటరిగా వుంది. విశ్రాంతిగా వుంది గతాన్ని గుర్తు చేస్తూ.

**'పూవూ లేదు**
**నేనూ లేను**
**సౌందర్యం ఆవరించింది'**

ఒక గులాబీని చూస్తూ జీవితకాలం గడిపేస్తానన్నాడు శేషేంద్ర. ఇక్కడ 'చూడడానికి పువ్వూ లేదు, నేనూ లేను' అంటున్నాడు కవి. కానీ అంతటా సౌందర్యమే వ్యాపించిం దంటున్నాడు. ఆధ్యాత్మిక పరిభాషలో చూసే వస్తువు, అంటే చూడబడేది, చూసే వ్యక్తి ఈ రెండు అదృశ్యమయితే సత్యం ఆవిష్కారమవుతుందంటారు. ఆధ్యాత్మికవేత్తలందరూ శూన్యా నికి రంగులద్దేవాళ్ళే. అట్లా పువ్వూ, కవీ మాయమయితే సౌందర్యమంటున్నాడు ఈ మార్మిక కవి.

ఒక నిశ్శబ్దాన్ని, ఒక నిర్మలత్వాన్ని, ఒక ఆహ్లాద దృశ్యాన్ని చిత్రించడం ప్రసాద్‌కు చేతనయిన విద్య.

**'చలికి ముడుచుకున్న**
**చెరువు పైన**
**వెన్నెల గిలిగింతలు పెడుతోంది'**

ఎవరూ లేని ఒక ఏకాంత స్థితిలో, వెన్నెలరాత్రిలో ఒంటరిగా చెరువును చూశాడు కవి. అది చలి రాత్రి. చెరువు చలికి ముడుచుకుని పడుకున్నట్లుందట! వెన్నెల చెరువుపై పడుతోంది. మిణుకు మిణుకుమనే కాంతి చినుకులు గిలిగింతలు పెడుతున్నట్లుంటుందట.

ప్రసాద్ అలౌకికానికి, లోకానికి వంతెన కట్టే కవి.

## 3

హైకూని ఆస్వాదించాలంటే మనకో మన:స్థితి కావాలి. మనకో నిశ్చలత్వం వుండాలి. క్షణకాలం పువ్వుపై దృష్టి కేంద్రీకరించాలి. తలెత్తి ఆకాశపందిరిలో నక్షత్రాల జలతారును చూసి పులకరించగలగాలి. ప్రత్యణువులో ప్రాణస్పందన వినగలిగే చేతన వున్నపుడే హైకూ మన గుండెల్లో బాకులా దిగబడుతుంది.

**'వినాలి**
**సౌందర్యం అరవదు**
**పిలుస్తుంది రహస్యంగా'**

సౌందర్యాన్ని చూడడం అందరికీ వీలుపడదు. కొందరే చూస్తారు. సౌందర్యాన్ని వినడం అతి కొద్దిమందికే వీలవుతుంది. హృదయంలోపల సున్నిత శబ్దాల్ని పసిగట్టే 'సిస్మోగ్రాఫ్' వున్నవాడు ప్రసాద్. అతను సౌందర్యపు పలకరింపును వినగలడు.

**'నువ్వు వస్తున్న సవ్వడి**
**నాలోని నవ్వు పరిమళాన్ని**
**మేలుకొల్పింది'**

ఈ చలన దృశ్యాన్ని ఎవరికివారు ఆవిష్కరించుకోవచ్చు. కానీ ప్రసాద్ దానికి రంగులద్దాడు. రాగాలద్దాడు. దృశ్యం వూహించడం సులభం. దానికి రంగూ రుచీ వాసనా యివ్వడం ప్రసాద్‌కే చేతనవుతుంది. ఆమె వస్తున్న సవ్వడి అతనిలో నిద్రిస్తున్న దరహాస పరిమళాన్ని మేల్కొల్పిందట! అల్లసాని పెద్దన ఆ పరిసరాల్లో వరూధిని వుందని తాంబూల వాసనని బట్టి గుర్తించాడు.

'మృగమద సౌరభ విభవత్
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలపు దెలుపు నొక్కమారుత మెలసెన్'

ప్రసాద్ సుకుమారుడు. అల్లిక జిగిబిగితో కాక మెత్తగా చెబుతాడు.

**'మనలో మహావిశ్వం**
**మనలోనూ**
**మనమొక మూల'**

మామూలుగా గుళ్ళూ గోపురాలు, పూజలు, పునస్కారాలు చూస్తూ వుంటాం. ఈ సృష్టికి ఒక కర్త వున్నాడని భావించి ఆయన్ని ప్రతిష్ఠించి పూజలుచేస్తాం. విగ్రహాలు లేక పోయినా ప్రార్థనామందిరాల్ని ఇతర మతాల వాళ్ళు దేవుని ఆలయాలనే అంటారు. మనం ఈ అనంత సృష్టిలో భాగమయినపుడు మనలోనూ మహావిశ్వ అంశ వుందని ప్రసాద్ అంటాడు. అది జెన్ తత్వం."I don't believe in God, I believe in Godliness" అన్నాడు ఓషో. మనందరం దైవత్వంలో భాగాలమని ప్రసాద్ కూడా అంటున్నాడు.

**'అందమైన పూవు ఇచ్చాను**
**అతను అన్నాడు**
**ఈ పూవుని ఏం చేయాలి'**

అందమయిన పువ్వునిస్తే ఆస్వాదించలేనివాడు, ఆనందించలేనివాడు అలాగే అంటాడు. కవిని, కవి హృదయాన్ని గ్రహించలేకపోతే అంతే!

ఒక సాయంత్రం సంధ్యాకాంతిని పరవశంగా చూస్తూ చలంగారు "సంధ్య ఎంత అద్భుతంగా వుంది" అంటే పక్కనున్నతను "ఎవరావిడ?" అన్నాడట. చలం అతనికి ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. ప్రసాదూ అంతే!

# హైకూ

మినీ కవితలని, నానీలని, రెక్కలని, హైకూలని ఎందరో ఎన్నో స్వదేశీ, విదేశీ ప్రక్రియల్లో కవితలు రాస్తున్నారు. సంపుటాలు తెస్తున్నారు. కానీ విలక్షణంగా, సమగ్రంగా హైకూలని ఆవిష్కరించి కవిత్వ ప్రేమికులందర్నీ అలరించిన అపూర్వ కవి బివివి ప్రసాద్. తన కవిత్వానికి ఒక భూమిక సిద్ధం చేసుకుని, దాన్ని సిద్ధాంత స్థాయికి తీసుకెళ్ళి హైకూలు రాస్తున్న సుకుమార భావుకుడు.

ప్రసాద్ 'ప్రకృతి, జీవితం హైకూల మయమే' అన్నాడు. నిజమే! 'సర్వం తత్కాల మత్పరాయణ మహో కామీస్వతాం పశ్యతి' అన్నాడు కాళిదాసు. సౌందర్యం, తాత్వికత సమపాళ్ళలో రంగరించి హైకూ రచన చేస్తాడు ప్రసాద్. 'హైకూ యిచ్చిన అనుభూతి పాఠకుడిని వెంటాడాలి, కానీ హైకూలోని కవిత్వం వెంటాడకూడదు' అన్నాడు ప్రసాద్. వీటిలో వైరుధ్యమున్నట్లనిపిస్తుంది. కానీ వైరుధ్యాల సమన్వయం కూడా వుంది.

కవి అతి సుకుమారుడయినపుడు, మనసు మెత్తదయినపుడు ఇలాంటి నిర్ణయాలు చేస్తాడని మనం భావిస్తాం. కానీ హైకూలో కనిపించే కేవల సౌందర్యస్పృహనే గ్రహించ కుండా, అది వుద్దేశించిన సత్యాన్ని, అనుభూతిని గ్రహించాలంటాడు ప్రసాద్.

ప్రసాద్‌లాంటి సుకుమారులతో వాదానికి దిగితే వాళ్ళ దగ్గర గొప్ప ఆయుధముంది. అదే.. మౌనం!

ప్రసాద్‌గారు ఆనందంలో లాలిత్యం చూస్తారు. సున్నితమైన స్వప్నాలు కంటారు.

**'వాన కురుస్తూనే వుంది**
**ఇంద్రధనస్సు ఎంతకీ**
**కిందకు రావటంలేదు'**

మనక్కూడా ఈ వానకు ఇంద్రధనుసు కిందికి జారకూడదా? లేదా కరిగిపోకూ డదా? అనిపిస్తుంది.

**'ఈ మట్టి నేలలో**
**ఎక్కడున్నాయో**
**రేపటి పూలు'**

అంటాడు మార్మికంగా..

ఉమర్‌ఖయ్యాం తన ప్రియురాలితో 'ఎదురుగా ఏపుగా పెరిగిన పచ్చికపై గంతులెయ్యకు. ఏ అజ్ఞాత సుందరీమణులు ఈ భూమిలో కలిసి ఈ లేత పచ్చికగా జన్మించారో' అంటాడు.

**'చిన్నప్పటి స్కూలు**
**అప్పటి మిత్రులు**
**ఎక్కడ ఉన్నారో'**

అంటూ మన మనసుల్ని కొన్నేళ్ళు వెనక్కి లాక్కెళ్ళి కన్నీళ్ళు తెప్పిస్తారు. ఆయన ప్రతి హైకూ సీతాకోకచిలుక పూలని తాకి వెళ్ళినట్లు మన మనసుని తాకి వెళుతుంది.

ఆకాశంలో ఇంద్రధనసు నేలకు దిగి రావాలి.

అజ్ఞాతంగా ఉన్న పూలు మట్టి గర్భం నించీ రావాలి.

అనిశ్చితంగా తిరిగే సీతాకోకచిలుక ఆగి కాసేపు మనతో ముచ్చటించాలి.

ప్రసాద్‌గారి క్షణక్షణం తళుకుమనే హైకూలు మనల్ని అజ్ఞాతలోకాలకి తీసుకెళ్ళాలి.

## 2

బి.వి.వి. ప్రసాద్ జపనీస్ హైకూని తెలుగు భాషకు అనుకూలంగా స్వీకరించారు. అంటే, హైకూ ఛందస్సు నియమాల్ని ఆమోదిస్తూనే స్వాతంత్ర్యం ప్రకటించారు.

ప్రసాద్ 'దృశ్యాదృశ్యం' హైకూ సంపుటానికి ముందుమాట రాస్తూ ఇస్మాయిల్‌గారు '17 వర్ణాల నియమం తెలుగులో పాటించడం అసాధ్యం. జపనీయ భాషలో ఏకవర్ణ పదాలెక్కువ. తెలుగులో బహువర్ణ పదాలు జాస్తి కనక, జపనీయ భాషను అనుకరించడం తెలివి తక్కువ' అన్నారు. ఇంకా 'ఎవరు పడితే వారు హైకూ రాయలేరు. దానికి ఒక విధమైన మానసిక వైఖరి కావాలి. ప్రకృతి ఎడల అపారమైన ప్రేమా, అంతర్ముఖత్వమూ రెండూ ఏకకాలమందు అవసరం' అంటూ ప్రసాద్ గురించి, 'స్వభావరీత్యా హైకూ రాయగలిగిన చాలా కొద్దిమంది కవుల్లో ఈయనొకరు' అన్నారు.

ప్రసాద్ తన హైకూ కవితా సంపుటిని 'పూలకీ, వెన్నెలకీ, సంజీవదేవ్ గారికి' అంకితమిచ్చాడు. పూల మెత్తదనం, వెన్నెల చల్లదనం వున్నవారు సంజీవదేవ్ గారు. అంకితంలోనూ భావుకత్వాన్ని పరిమళింపజేశారు ప్రసాద్.

**'ఓ సీతాకోక**
**చుట్టూ చేరాయి**
**నదీ, పర్వతాలూ'**

చిత్రకళకు హైకూ దగ్గరగా వుంటుంది. చిత్రంలో సీతాకోకచిలుక వుంది. పర్వతాలున్నాయి. నదులున్నాయి. మనం సీతాకోకచిలుకపై దృష్టి నిలిపితే తక్కిన పర్వతాలు, నదులూ దానికోసమే అక్కడ వున్నట్లనిపిస్తుంది.

మార్మికతీరాల మందహాసం ప్రసాద్ హైకూల్లో వుంది.

**'నిద్రపోయాను**
**చీకటిలో**
**చీకటి పడింది'**

నిజమే కదా! చీకటి పడగానే మనకు నిద్రవస్తుంది. కళ్ళుమూసుకుని పడుకుంటాం. కళ్ళు మూసుకుంటే అంతా చీకటే కదా! ఆ అనుభవాన్ని కవి 'చీకటిలో చీకటి పడింది' అంటున్నాడు చిత్రంగా.

**'మేఘం తొలగింది**
**చందమామ**
**క్షణం ఆగానేమో!'**

వెన్నెల రాత్రి, బయట నడుస్తూ వుంటాం. చంద్రుడి కడ్డంగా ఒక మేఘం వస్తుంది. చూస్తూ వుండగానే ఆ మేఘం సాగిపోయి ఒక్కసారిగా చంద్రుడు కనిపిస్తాడు. వెన్నెల కుండల్తో కుమ్మరించినట్లవుతుంది. అప్పుడు నడుస్తున్న వ్యక్తి క్షణకాలం ఆగి ఆ అనుభవాన్ని జలదరింపుగా గ్రహిస్తాడు.

**'పాట బాగుంది**
**దూరంనించి వినిపించటం**
**ఇంకా బాగుంది'**

నిజమే కదా! నగరం రద్దీలో నిశ్శబ్దానికి అవకాశముండదు. వాహనాల కదలిక లేని ప్రశాంత ప్రదేశంలో దూరం నించీ వినిపించే పాటను కవి విన్నాడు. పాట బాగుం దన్నాడు. దూరంనించి వినిపించడం మరీ బాగుందంటున్నాడు.

బీథోవిన్ ఒక సాయంత్రం వీధిలో వెళుతూవుంటే ఒక ఇంట్లోనించి ఆయన పాటను ఒకమ్మాయి పియానోపై సాధన చేస్తూ 'బీథోవిన్ వచ్చి ఆ పాటను పియానోపై వాయిస్తే ఎంత బాగుండు' అందట! బీథోవిన్ ఆ ఇంట్లోకి వెళ్ళి ఆ అమ్మాయి కోసం ఆ పాటను వాయించాడు. ఆ అమ్మాయి గుడ్డిది. చూస్తూ వుండగానే చీకటిపడి కిటికీలోంచి వెన్నెల వచ్చి పియానోపై, ఆ అమ్మాయిపై వాలిందట!

ఆ అనుభవమే ఆయన ప్రసిద్ధ 'మూన్‌లైట్ సొనటా' ఆవిర్భావానికి కారణం.

ప్రసాద్ కవితల్లో ఎన్నోచోట్ల చంద్రుడుంటాడు. చంద్రుడు ఇప్పుడు దూర మయ్యాడు కానీ, చిన్నప్పుడు ప్రసాద్ దగ్గరే వుండేవాడు.

**'చందమామ**
**నా బాల్యంలో**
**చాలా అందంగా ఉండేది'**

అని అందుకే అన్నాడు.

## 3

ప్రసాద్ నిశ్శబ్దాన్ని ప్రేమించే కవి. నిర్మలత్వాన్ని నిలుపుకునే కవి. 'యుద్ధరంగంలో నైనా కవిత్వం రాయడానికి ఏకాంతం అవసరం' అన్నాడు జర్మన్ కవి గోథె. ఈ సంకుల ప్రపంచంలో ప్రశాంతతని సృష్టించుకుని పరవశగానం చేసే అద్వితీయకవి ప్రసాద్.

కొన్ని వూహలు కొంతమందే చేయగలరు. అట్లాంటి అపూర్వమైన వూహలు వాళ్ళు ఎలా చెయ్యగలరా? అని మనం ఆశ్చర్యపోతాం. అంత సున్నితంగా, అంత సుందరంగా ప్రసాద్ ఊహిస్తాడు. ఊహకు అందని వూహలు చేస్తాడు.

**'చేయి పట్టుకొంది నిద్రలో**
**పాప కలలోకి**
**ఎలా వెళ్ళను'**

పక్కన పడుకున్న పాప నిద్రపోతూ, తండ్రి చేయి పట్టుకుందట. పాప ఏదో కలకంది. అది భయపెట్టేదో, ఆనందపెట్టేదో? ఆ సంగతి తెలుసుకోవడం కష్టం. ఆ కలలో ఏముందో మనం తెలుసుకోవాలంటే కలలోకి అడుగుపెట్టాలి కదా! మనం కలని కనుక్కోలేం. అందుకే కవి 'పాప కలలోకి ఎలా వెళ్ళను' అంటాడు నిస్సహాయంగా.

**'ఎంత అందంగా నవ్విందీ**
**పాపాయికి చెప్పాలి**
**పెద్దయాక'**

మన పిల్లలు చిన్నవాళ్ళుగా వున్నపుడు ఎంతో స్వచ్ఛంగా, పువ్వుల్లా నవ్వుతారు. ఆ నవ్వులో కల్లాకపటం వుండదు. అక్కడ దైవత్వం వుంటుంది. అట్లా 'నువ్వు చిన్నప్పుడు ఇలా నవ్వావు' అని కవికి, పెద్దయిన పాపాయికి చెప్పాలనిపించిందట!

మనిషి ప్రేమిస్తే పరిసరాలు మారిపోతాయి. పరిసరం రాగరంజితమవుతుంది. రంగులతో నిండుతుంది. ఆమె వుంది, అతనున్నాడు.

**'ఆమె వెళ్ళింది**
**గది విడవలేదు**
**పూలవాసన'**

కాసేపుండి ఆమె వెళ్ళిపోయింది. పువ్వు వెళ్ళిపోయినా పరిసరాలు ఇంకా పరిమళాలతో నిండి వున్నాయట. ఆమె అందం, ఆమె నవ్వు, ఆమె మాటలు కవి జ్ఞాపకాల్లో అప్పటికీ సజీవంగా వున్నాయట!

మనకు మామూలుగా కనిపించేవన్నీ హైకూ కవికి భిన్నంగా కనిపిస్తాయి. అతను సత్యాన్ని ఆవిష్కరిస్తాడు. మనకు తెలియని కోణాల్ని సౌందర్యభరితంగా ప్రదర్శిస్తాడు. అక్కడ అది వుంది. అరే! మనకు ఆ ఆలోచనే రాలేదే అని ఆశ్చర్యపోతాం. మనమట్లా ఎందుకు చూడలేకపోయామా? అని నివ్వెరపోతాం.

**'రంగురంగుల పూలు**
**నీడలన్నీ**
**ఒకే రంగులో'**

మనం రంగురంగుల పూలను చూస్తాం. వెళతాం. హైకూ కవి వాటి నీడలు కూడా చూస్తాడు. అంతే కాదు పూలు విభిన్న వర్ణాలలో వుంటే, నీడలన్నీ ఒకే రంగులో ఎందుకున్నాయి? అని సందేహం వ్యక్తపరుస్తాడు. నిజమే కదా! ఆలోచన హేతుబద్ధంగానే కనిపిస్తుంది. కానీ సమాధానం ఎవరిస్తారు?

**'ఆకాశం**

**కొలనులో మునిగిందా**

**తేలిందా!'**

కొలనులో, నిర్మల సరస్సులో ఆకాశం ప్రతిబింబిస్తోంది. హైకూ కవికి ఒక సందేహం కలిగింది. ఆకాశం కొలనులో కనిపిస్తోంది. అది కొలనులో వున్నట్లు తెలుస్తోంది. ఇంతకూ అది మునిగిందా? తేలిందా? అంటాడు. మనసుని వుయ్యాలలూపే వూహాలు ప్రసాద్‌వి.

## 4

తన సహృదయతని, సౌమనస్యాన్ని, తను గ్రహించే సౌందర్యాన్ని అందర్తో పంచుకోవాలనుకుంటాడు ప్రసాద్. ఆయన దగ్గర అంతులేని భావనా ప్రపంచముంది. అందులో మనందర్నీ విహరించమంటాడు. విశ్రాంతి తీసుకోమంటాడు.

**'పౌర్ణమి రాత్రి**

**వీధులు నిర్మానుష్యం**

**వెన్నెలంతా ఏం చేసుకోను'**

పున్నమి రాత్రి. పుచ్చపువ్వులాంటి వెన్నెల. వీధుల్లోకి వచ్చాడు కవి. ఎవరూ లేరు. నిర్మానుష్యం. అంతా వెన్నెల. అంతులేని వెన్నెల. అన్ని దిశలా ఆవరించి భూమ్యాకాశాలు విస్తరించిన వెన్నెల.

భావకవి వేదులవారు చంద్రుడి గురించి అద్భుతంగా వర్ణించారు.

'నీవొక అప్సరః ప్రమదినీ కబరీచ్యుత పారిజాతమా

లా విసరంబవో, మరి ఇలా తలమంటు శరత్ విభావరీ

దేవి లలాటకా మణివో దీపికవో సురరాజ్యలక్ష్మికిన్' అన్నాడు.

చంద్రుణ్ణి, నిండు చంద్రుణ్ణి చూసి ఒళ్ళు మరచిపోని కవులుంటారా?అట్లా ఎక్కడ చూసినా వెన్నెల. అంతా కవి సొంతంలా కనిపించింది. ఎవరికయినా యిద్దామన్నా ఎవరూ కనిపించలేదు.

ఒక చిన్న జెన్ కథ.

ఒక జెన్ రుషి ఒక గుడిసెలో నివసించేవాడు. ఒక దొంగ ఆ గుడిసెలోకి వచ్చి వెతికాడు. ఏమీ దొరకలేదు. జెన్‌రుషి తనకున్న ఒక్క కండువానూ అతనికిచ్చి అతన్ని సాగనంపటానికి బయటికి వచ్చి నిండుచంద్రుణ్ణి ఆకాశంలో చూసి 'అయ్యో! ఆ చంద్రుడు అందితే యితనికిచ్చి పంపేవాణ్ణి కదా!' అని వాపోయాడట.

అట్లా అంతులేని వెన్నెల్ని పంచుకోలేని స్థితికి పరితపించాడు ప్రసాద్. చంద్రుడు వివిధ కళల్లో ప్రసాద్ హైకూల్లో దర్శనమిస్తాడు.

**'కెరటం**

**మరొక కెరటం**

**క్రమంగా చంద్రోదయం'**

మొదటగా ఒక అలలా వెన్నెల తెర కదుల్తుంది. తరువాత మరొక కెరటం. ఆ తరువాత తెల్లటి ఆశ్చర్యంలా చల్లటి చంద్రుడు రంగంలోకి వచ్చాడట. చంద్రోదయం ముందు మనల్ని మనం మరచి నిల్చోవాలి!

**'ఈ రాత్రి మబ్బులది**
**ఇపుడు చందమామ**
**ఒక తెల్లని మరక'**

చంద్రుడుంటాడు. వెన్నెల వుంటుంది. చూస్తూ వుండగానే మబ్బులు వస్తాయి. ఆకాశాన్ని ఆక్రమిస్తాయి. చీకటి వ్యాపిస్తుంది. కానీ మసక మసగ్గా చంద్రుడు కనిపిస్తాడు. కనిపించకున్నా ఒక తెల్లని మరకగా మిగుల్తాడు.

**'మేడదిగి చూస్తే**
**ఇందాక నిలుచున్నచోట**
**చందమామ'**

రాత్రిపూట ఆకాశంలో చంద్రుడుంటాడు. తెల్లవారితే కిందకు దిగుతాడు. మేడ దిగి వచ్చిన కవికి అనుభవం వేరు. మేడమీద చంద్రుడున్నాడు. మేడమీదనించి చూస్తే తలపై వున్నాడు. మేడ దిగిచూస్తే యిందాకా తానెక్కడ నిల్చున్నాడో అక్కడ చంద్రుడున్నట్లు నిపించిందట. అక్కడ చంద్రుడు కవిని అనుసరిస్తున్నట్లు, కవిని చూస్తున్నట్లు అనిపిస్తుంది.

## 5

హైకూలో సత్యం, సౌందర్యం వుంటాయి. ఒకదాన్ని ఒకటి అధఃకరించవు. సత్యం ముఖ్యమయినపుడు సౌందర్యం దానికి దారినిస్తుంది. సౌందర్యం ప్రధానమయినపుడు సత్యం దానికి అవకాశమిస్తుంది. అవి ఒకే నాణేనికి రెండు వైపులు ఒకోసారి అవి ఒక దాంట్లో ఒకటి కలిసిపోతాయి.

**'సూర్యాస్తమయం**
**ఇది ఎన్నోసారి**
**ఎవర్ని అడగాలి'**

నిజమే కదా! ప్రతిరోజూ సూర్యాస్తమయాన్ని చూస్తూ వుంటాం. ఇప్పటికి ఎన్నికోట్లసార్లు అలా జరిగిందో ఎవరికి తెలుసు? ఎవర్నడగాలి?ఎవరు చెప్పగలరు? 'ప్రతిరోజూ తినడం, తిన్నది అరిగించుకోవడం, ఆపై చనిపోవడం. ఇదే జీవితం' అన్నాడు ఒక జెన్ రుషి. ఇంకో జెన్ రుషి అయితే 'నా జీవితం మీద నేను వుమ్మేశాను' అన్నాడు

జీవితంలోని రొటీన్ జీవితాన్ని దాటి చూస్తేనే తెలుస్తుంది. దానికి ఒక తాత్విక చింతన అవసరం.

మనల్ని ఈ విసుగుదల నించీ, రొటీన్ నించీ సజీవంగా వుంచేది సౌందర్యమే.

ప్రకృతికి, మనకు వున్న ఏకైక సంబంధం సౌందర్యమన్నాడు గోథే. ఈ యాంత్రికత నించీ సౌందర్యమే మనకు విముక్తినిస్తుంది.

**'ఎవరో తెలియదు**
**చిరపరిచయం**
**ఆమె చిరునవ్వుతో'**

ఏ రసాయన సమ్మేళనంతో ఈ శరీరం రూపొందిందో? శరీరం అణువుల మయం అంటారు. బాగానే వుంది. ఈ అణువుల సమ్మేళనంలో అనురాగ మెక్కడినించి వచ్చింది? కన్నీళ్ళెక్కడివి? సౌందర్యమెలా రూపొందింది? సైన్సు ఎప్పుడూ అసమగ్రమే. తాత్వికతని అది కలుసుకున్నప్పుడే సమగ్రత ఏర్పడుతుంది.

ఆమె చిరునవ్వులో కవి 'చిరపరిచయాన్ని' చూశాడు. ఆమె అపరిచిత. కానీ చూపులో, చిరునవ్వులో 'జననాంతర సౌహృదాని' కనిపించింది.

**'ఆహా! వాన**
**ఎంత బావుంది**
**స్కూలు వుండదు!'**

నిజమే! పసిపిల్లలకు పరమానందం కలిగించే విషయమిది. ఇప్పుడేమో కానీ వెనకటి రోజులు గుర్తుకొస్తాయి. వర్షమొస్తే స్కూలు వుండేది కాదు! అన్నిటికన్నా బాధా కరమైన విషయం స్కూలంటే పిల్లలు భయపడడం. అందుకే వాళ్ళకు వర్షమొస్తే ఆనందం.

**'చలిరాత్రి**
**తల్లీబిడ్డల్ని**
**చూస్తేనే వెచ్చదనం!'**

ఎంత గొప్ప కవిత! చలిరాత్రిలో కవుల వూహలు వేరు, కలలు వేరు. కానీ ఈ కవి, ఈ తాత్విక కవి చలిరాత్రిలో తల్లి ఒడిలో ఆదమరచి ఆనందంగా నిద్రిస్తున్న బిడ్డని చూసి 'వెచ్చదనం' ఫీలయ్యాడు!

ఏదయినా కవిని ఆకర్షిస్తుంది. చలనమయినా, నిశ్చలనమయినా, అంతా ఆనందమయమే.

**'రాలిన పూవు**
**కదిలితే హైకూ**
**కదలకుంటే హైకూ!'**

అక్కడ పువ్వు వుంది. అది చాలు దాన్ని అందంగా ఆవిష్కరించడానికి. అది కదిలినా హైకూ రాస్తాడు. కదలకున్నా హైకూ రాస్తాడు.

నిశ్శబ్ద సంచలనాలకి నిలువెత్తు కవిత ప్రసాద్!

# పూలురాలాయి

ఒక సన్నటికిరణం కిటికీ నించి వస్తుంది. మనసుని తాకుతుంది. కంటిచివర ఒక నక్షత్రం కదుల్తుంది. ఒక హైకూ ఆవిర్భవిస్తుంది.

పూలు వున్నంత వరకు, ఆకాశం వున్నంత వరకూ, వాన వున్నంత వరకూ, వెన్నెల కురిసేంత వరకూ ప్రసాద్ హైకూ ప్రయాణం కొనసాగుతుంది.

**'దాచుకోగలిగితే**
**ఈ వెన్నెల**
**ఇంత కోమలంగా ఉంటుందా?'**

జీవితం ప్రవాహంలా సాగినపుడే పరమాద్భుతంగా వుంటుంది. పరిపూర్ణ అనుభవంతో సమస్యలేదు. 'అసంపూర్ణ అనుభవాలే ఆలోచనలు, గతాలు' అన్నాడు జిడ్డు కృష్ణమూర్తి. 'ఒకే నీటిలో రెండుసార్లు పాదాలు మోపలేం' అన్నాడు పైథాగరస్. ప్రవహించే నీరు నిలువ వుండదు కదా! దాంట్లో రెండుసార్లు పాదమెట్లా మోపుతాం?

అట్లాగే వెన్నెల కూడా సాగుతుంది. దాన్ని దాచుకుంటే దాని సౌరభాన్ని, ప్రాణ స్పందనని కోల్పోతుంది, కోమలత్వాన్ని కోల్పోతుందంటున్నాడు ప్రసాద్. ఏదైనా సొంతం చేసుకోవడంతో దాని జీవలక్షణం కోల్పోతుంది. మనం గట్టిగా పట్టుకున్నది మనల్ని గట్టిగా పట్టుకుంటుందన్నాడు కృష్ణమూర్తి.

కవి సీతాకోక చిలుకని ఆహ్వానిస్తున్నాడు.

**'రా సీతాకోకా..**
**నా గదిలో ఒకసారి**
**ఎగిరి వెళ్ళు'**

గదంతా చలనం లేకుండా వుంది. నిర్జీవంగా వుంది. 'సీతాకోకచిలుకా! ఒకసారి వచ్చి వెళ్ళు. పరిసరాల్ని వెలిగించు. గదికి ప్రాణస్పందన కలిగించు' అంటున్నాడు.

**'కలలో**
**ఒకరితో అన్నాను**
**ఇది కలలా వుంది!'**

నిజమే. ఇది కలకంటున్న కల!

**'సీతాకోకని**
**చిత్రించటంకూడా తేలిక**
**ఓ రెక్క ఊహిస్తే చాలు'**

కవి శిల్పం యిక్కడ వుంది. కవిలో సీతాకోకచిలుక వుంది. దాని రెక్కను వూహిస్తే చాలు. క్రమంగా దాని సమగ్రరూపం ఆవిష్కరిస్తుంది. చిత్రకారుడి అంతరంగంలో కూడా

సీతాకోకచిలుక వుంటుంది. ఆయన వూహలో దాని రెక్క మెదిల్తే చాలు, దాన్ని అతను సంపూర్ణంగా చిత్రించగలడు.

**'ఎంత తెల్లనిమంచు**
**ఎంత చల్లదనం**
**చందమామలో వున్నానా!'**

మనం అనుభూతిలో కరిగిపోవాలి. అదృశ్యం కావాలి. తెల్లని మంచు చల్లదనంలో అదృశ్యమయిన కవి 'నేను చందమామలో వున్నానా!' అంటున్నాడు.

ప్రకృతిలో, పరిమళంలో అదృశ్యం కాగలిగిన ఆర్ద్రత వున్న కవి ప్రసాద్.

# అనువాదాలు

**బివివి ప్రసాద్** జపనీస్ హైకూ కవుల్ని పరిశీలించాడు. హైకూ పితామహుడయిన బషో జీవితాన్ని, కవిత్వాన్ని చదివాడు. బషో గురించి భ్రమణకాంక్షలో ఆదినారాయణరావుగారు రాశారు. వీరభద్రుడు బషోపై పుస్తకం రాశాడు. రూప్‌కుమార్ డబ్బీకార్ హైకూ సారస్వతంలో బషో గురించి వివరించాడు.

అంగరక్షకుడుగా, ఆత్మీయుడుగా, రాజుగారికి ఆంతరంగికుడుగా పనిచేసిన బషో ఆ రాజు హఠాత్ మరణంతో టోక్యో వెళ్ళి నిరాడంబర జీవితం గడిపి, విస్తృతంగా పర్యటిస్తూ హైకూలు రాశాడు.

ప్రసాద్ ఆ బషో కవితల్ని మనోహరంగా తెలుగు చేశాడు. అనువాదాలనడం కన్నా వాటిని అనుసృజనలనడం మేలు. వాటికీ, ప్రసాద్ హైకూలకూ మనకు భేదం కనిపించదు. కారణం వాటిని ఆత్మీయంగా అనువదించడమే.

**'నిశ్శబ్దం**
**కీచురాళ్ళ చప్పుడు**
**రాళ్ళలోకి చొచ్చుకుపోతుంది'.**

నిశ్శబ్దంగా వున్నపుడు కీచురాళ్ళ శబ్దం రాళ్ళలోకి చొచ్చుకుపోతోందట! ఆ శబ్దం అంత శక్తివంతంగా వుందట. రాళ్ళలోకి చొచ్చుకుపోవడమనే వూహ అపూర్వం.

**'మంచుబొట్లు**
**ప్రపంచం ధూళిని**
**ఎంతబాగా కడిగేస్తాయి!'**

ఆధ్యాత్మికవేత్తలందరూ ఆత్మలపై అనుభవధూళి పేరుకుని వుంటుందంటారు. దాన్ని తుడిచేస్తే అద్దంలా ఆత్మ ప్రకాశిస్తుందంటారు. మంచుబిందువులు మాలిన్యం అంటనివి. అంతేకాదు, అవి ప్రపంచధూళిని పరిశుభ్రం చేస్తాయట!

**'పేదబాలుడు**
**చందమామని చూడటంలేదు**
**బియ్యం ఆడించే పనిలో'**

పేదవాడికి అందం, ఆధ్యాత్మికత అందుబాటులో లేని విషయాలు. అవసరాలు తీరడమే ముఖ్యం. అందుకనే ఆ పేదకుర్రాడు బియ్యమాడించే పనిలో వున్నాడట.

**'చేపల్ని వేటాడుతూ పిట్ట**
**ఎంత ఉత్సుకత**
**ఎంత విచారకరం'**

నిజమే, పిట్ట బతకాలంటే చేపల్ని వేటాడాలి. ఆ చేపల్ని పట్టడంలో, ముక్కున

కరచుకోవడంలో అది ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తోంది. అది దాని అవసరం. దాని ఉత్సాహంలో ఆకర్షణ వున్నా, అక్కడ చేపలది జీవన్మరణ సమస్య. అది విచారకరమంటున్నాడు.

**'నా కొత్త దుస్తుల్లో**
**ఈ ఉదయం**
**మరొకరెవరో!'**

జెన్ తత్వం ఎరిగిన బషో భావుకత్వాన్ని అర్థవంతంగా ప్రసాద్ అనువదించాడు. కొత్తదుస్తులు వేసుకున్న తనకు తనే కొత్తగా కనిపించాడట!

ఒక జెన్ రుషి ఉదయాన్నే నిద్రలేస్తూనే బిగ్గరగా తనని తను పేరుపెట్టి పిలిచి, 'మేలుకో! వుదయాన్నే ఫలానా ఫలానా పనులు చేయాలి. అప్రమత్తంగా వుండు!' అని హెచ్చరించేవాడట. అందరూ విస్తుపోయేవారట!

అట్లాంటి జెన్ తత్వాన్ని ఆవిష్కరించిన బషో, ఆయన్ని తెలుగు వాళ్ళకి సన్నిహితం చేసిన ప్రసాద్ ధన్యులు.

# విశ్వమై విస్తరించిన కవిత్వం

**కొంతమంది,** కాదు, దాదాపు చాలామంది జీవితానికి వేరై ఉంటారు. ప్రకృతికి వేరయివుంటారు. మనం ప్రకృతిలో భాగం కాదు, ప్రకృతిని మనం నియంత్రిస్తాం అనుకునే వాళ్ళు పరాభవం పాలవుతారు. పరివేదనకు గురవుతారు. ప్రసాద్ ఏ అనుభవానికయినా తనను తాను సమర్పించుకుంటాడు, లీనమవుతాడు. ఆత్మ సమర్పణలో ఆనందముంటుంది. ఘర్షణ వుండదు.

అతని సృజనశక్తి అతివేలమయింది. సాదాసీదాగా కనిపిస్తుంది కానీ, సాధికారిక మైంది. మామూలు మాటల్లో మహాద్భుతాన్ని ఆవిష్కరిస్తాడు.

'చందమామ వామనుడిలా
వెన్నెల పాదాలని
నింగీ, నేలపై మోపింది
మూడో పాదానికి
నా హృదయాన్ని చూపాను
ఇక రహస్యాంతర లోకాలకి అణగి
కవిత్వాన్నయి ప్రకాశించాలి'

ఒక పురాణ ప్రతీకకి గొప్ప నవ్యతని ఆపాదించాడు. చంద్రుడి మూడో పాదానికి తన హృదయాన్ని చూపాడు. అక్కడ కూడా సౌమ్యత. అతని సౌందర్యాభివ్యక్తిలో సారళ్యమే కాదు, నమ్రత వుంటుంది. తన లోపలి ప్రపంచ ప్రయాణానికి ఆ వెన్నెల స్పర్శ ఆలంబన మయిందంటాడు.

ప్రపంచ దృష్టి వేరు. ప్రసాద్ దృష్టి వేరు. మన వూహలకందనివి ఆయన ఆలోచనలు, అనుభూతులు. తను తనలాగా మాత్రమే ఆలోచిస్తాడు. అవి ఆయన సొంతం.

'అబ్బాయిపుడితే
తండ్రి మాత్రమే అయ్యేవాడిని
అమ్మాయి పుట్టి తల్లిని కూడా అయ్యాను'

'స్త్రీని మగాడితో సమం కమ్మని
ఎలా శపించను?
మగాడిని స్త్రీతో సమం కమ్మని దీవిస్తాను'

ఇక్కడ లోకానికి అలవాటయిన ఒక విషయం తెచ్చాడు. కొడుకు పుట్టినా, కూతురు పుట్టినా తండ్రి తండ్రే అని లోకం భావిస్తుంది. కానీ అతని దృష్టివేరు. కూతురు పుట్టింది కనుక తాను తల్లినయ్యానంటున్నాడు. ఆ సందర్భంలో స్త్రీ పురుష సమానత్వం ప్రసక్తి వచ్చి 'నేను స్త్రీని మగాడితో సమం కమ్మని అనను, పురుషుణ్ణే స్త్రీతో సమం కమ్మని అంటాను' అంటూ స్త్రీకి పైచేయి యిచ్చాడు.

అతని సౌకుమార్యం అతివేలమయింది. ఒక కఠినమయిన మాటకు కూడా కందిపోయే తత్వం అతనిలో వుంది.

'మనిషి వినా భూమ్మీద అసహజమేముంది?
భూమినో, నింగిపొరనో, మనస్సునో
గాయపరచి గర్వించే మనిషి వినా
భూమ్మీద భయానకమేముంది?'

ప్రసాద్ తోటలో పువ్వులాంటివాడు. ఎంత సున్నితమైన వాడంటే గాయపరిచే, గర్వించే మనిషిని భయానకుడంటున్నాడు. అసలు మనిషిని మించిన అసహజం ఈ ప్రపంచం మీద ఇంకొకటి లేదంటున్నాడు. ఎప్పుడో ఎక్కడో ఈ పసిహృదయం గాయపడిన ఛాయలు కనిపిస్తాయి.

ఆనందంలో భాగమయితే కానీ అద్వైత ఆనందం అనుభవానికి రాదని, చిన్ని కవితలో చెప్పాడు.

'మేం గదిలో పాటలు పాడుకుంటుంటే
ఇద్దరు చిన్నారి తూనీగలు
గుమ్మాలలోంచి
అటూ ఇటూ ఎగురుతుంటారు
మాకు పాటలు పాడుకోవడమే తెలుసు
పాట కావడమంటే ఏమిటో వాళ్ళకి తెలుసు!'

అదీ అసలు సంగతి. ఆడుతూ పాడుతూవుంటే పిల్లలు ఆటలో భాగమయిపోతారు. మనుషులందరూ తమ పనుల్లో లీనమయితే ఒక తన్మయ ప్రపంచం ఆవిష్కారమవుతుంది. సంఘర్షణ అవసరంలేని సమన్వయ స్థితిని కవి ఆశిస్తున్నాడు.



# లోపలి ప్రపంచం లోలోతుల్లోకి

**ప్రసాద్** విలక్షణమయిన కవి. విభ్రమం కలిగించే కవి. ఎక్కడా ఏ కోశానా గంభీ రాన్ని వదలని కవి.  ఆయన నిత్య సత్యాన్వేషి. సత్య నిత్యాన్వేషి .కానీ ఒక సౌకుమార్య సాహసాన్ని వదలని కవి. సంస్కృతంలో 'మసృణ' అంటారు. అంటే సున్నితత్వం మెరుస్తున్న కవి. కాళిదాసు 'శాకుంతలం'లో 'కిసలయసమానం' అన్నాడు. అంటే అప్పటిదాకా స్పర్శిం చని లేతచిగురు. అట్లాంటి కవి. కిరణాలతో పూలదండలల్లడం, పూలతో పాటలు పాడించడం నేర్చిన కవి ప్రసాద్. అనునిత్య అంతస్సంక్షోభం అతి మార్దవంగా ప్రదర్శిస్తాడు.

'కలనించి మేలుకొన్నట్టు మెలకువ నించీ మేలుకోవాలనిపిస్తుంది
ఇంత జీవించే రొదలోనూ ఏదో నిశ్శబ్దం వెంటాడుతుంది
లోతయిన నీటిలోకి ఎండ మృదువుగా అంతరిస్తుంది'

అతని అభివ్యక్తి చూడండి. ఎంత ఆశ్చర్యకరంగా ఇట్లాకూడా చెప్పవచ్చునా? అనిపిస్తుంది. కలనించి మేలుకున్నట్లు, మెలకువ నించీ మేలుకోవాలనిపిస్తుందట. సాధారణ మానవుడికి సంబంధించిన ఆలోచన కాదిది. మెలకువని కలగా తెలిసినవాడికి మాత్రమే వీలయ్యే పని యిది. అనివార్య జీవన సంక్షోభంలోనూ అతను నిశ్శబ్దాన్ని దర్శించగలడు. 'పద్మపత్రమివాంభసా' తామరాకుపై నీటిబొట్టులా జీవించగలడు.

'నేనెవరు?' అన్న ప్రశ్న తొలచుకుంటూ లోలోతుల్లోకి వెళుతుంది. దారినిస్తే అది దహించి వేస్తుంది. జ్ఞానం విస్ఫోటనం లాంటిది. ఎడతెగని ప్రయాణం లాంటిది.

‘ఈ అస్తిత్వపు రాయి నెవరో విసిరారు. కాలం కొలనులోకి
నా అలలారా! బద్ధకించకండి
వేలమైళ్ళ పొడవైన కాంతిని మోశాక
నా స్థలం ఖాళీ చెయ్యాలి
ఒక గడ్డిపువ్వుకోసం లేదా వానచినుకుకోసం
అప్పుడిక ఎవరి అడుగుల చప్పుడూ వినిపించని ఏకాంతం
నన్ను స్వీకరిస్తుంది’

తన సంఘర్షణ నించి తనే బయటపడాలి. ఇది ఉనికికి సంబంధించిన అన్వేషణ. ఇది అంతులేనిది. అన్నీ ముగిశాక మనమొక నిర్మలమైన, నిర్మయమైన ఏకాంతంలోకి ప్రవేశిస్తాం. అక్కడ ప్రశాంతత వుంది. పోతనగారు అన్నారిలా..

‘లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుది అలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వడు
ఏకాకృతి వెలుగు తని నే సేవింతున్’

అక్కడ అనంత తీరాల వెనుకవున్న సృష్టికర్తను ఆయన భక్తితో ఆరాధిస్తున్నాడు. ప్రసాద్ ఆధునికుడు. ఓషో There is no God, but there is Godliness అన్నాడు. ‘దేవుడు లేడు, దైవత్వం వుంది’ అన్నాడు. ఆ దైవత్వంలో మనందరం భాగాలమన్నాడు. మనందరిలో దైవత్వముందన్నాడు. ప్రసాద్ అట్లాంటి దైవత్వాన్ని, అట్లాంటి ఏకాంతాన్ని దర్శించాడు.



# కల - నిజం

**బివివి ప్రసాద్** కలకు, వాస్తవానికి వున్న హద్దులు చెరిపేస్తాడు. కలను నిజంగా నిరూపిస్తాడు. నిజాన్ని కలను చేస్తాడు. మనం నివ్వెరపోతాం. ఎందుకంటే మనమొక నిజమయిన ప్రపంచంలో జీవిస్తున్నామని అనుకుంటాం. మన భ్రమావలయాన్ని ఆయన ఛేదిస్తాడు. మన కలను నిజం చేస్తాడు. మన నిజాన్ని కలను చేస్తాడు. ఆ నైపుణ్యం ఆయన దగ్గరుంది.

'కలలు కలలే, కలలకి రక్తమాంసాలుండవు' అంటూ కవిత ప్రారంభమవుతుంది. నిజమే కదా! కల ఒక నైరూప్యం అని మనమనుకుంటాం.

'కలలు నన్ను నడవనిస్తాయి

కలలు నన్ను నడవనియ్యవు' అంటాడు చిత్రంగా. మెల్లగా కలలోకి దారి చేసుకుంటున్న వాస్తవాన్ని ప్రదర్శిస్తాడు. మనం అనుకునే కల రూపురేఖల్ని మారుస్తాడు. కల కుడి, ఎడమలు మార్చుకున్న నిజంలా వుంటుంది.

'ప్రతిబింబానికి రక్తమాంసాలుండవు

రక్తమాంసాలలో కలలు సంచరిస్తాయి

నిలువెత్తు కలలో రక్తమాంసాలు ప్రవహిస్తాయి'

తలకిందులయిన కలే వాస్తవమంటున్నాడు. కుడి, ఎడమలయిన కలే నిజమంటున్నాడు. ఆ కల రక్తమాంసాల్లో సంచరిస్తుందట. కలలు కనేది మన తలే కదా! అంటే దానికి పునాది వుంది. అదే ఆ కల బలమైందయితే, తప్పనిసరిగా అది నిజమయి తీరుతుందని, సజీవంగా ఆవిష్కరింప బడుతుందని అంటున్నాడు.

సుప్రసిద్ధమయిన ఒక జెన్ కథ వుంది. చువాంగ్ ట్జూ ప్రాచీన చైనా తావోవాది. ఓసారి ఆయన కలగన్నాడు. కలలో ఆయన సీతాకోకచిలుకగా మారి అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఆ కలలో ఆయన తానొక మనిషినన్న స్పృహ ఆయనకు లేదు. కేవలం సీతాకోకచిలుకగా వున్నాడు. హఠాత్తుగా ఆయనకు మెలకువ వచ్చింది. చుట్టూ చూశాడు. తాను మంచంమీద పడుకున్నట్లు తెలుసుకున్నాడు.

ఆయనకు అప్పుడొక సందేహం కలిగింది. అది సమాధానం లేని సందేహం.

'నేను సీతాకోకచిలుకనని కలగన్న మనిషినా?

లేదా మనిషినని కలగంటున్న సీతాకోకచిలుకనా?'

అచ్చం యిలాంటి సందేహానికే ప్రసాద్ ఆస్కారమిస్తున్నాడు. ఈ సందేహాన్ని కొనసాగిస్తున్నాడు.

'కలకి అనువాదం నిజమా?

నిజానికి కల అనువాదమా? తెలీదు

కల విషాదం కాదు. నిజం విషాదం కాదు

విషాదమంతా అనువాదమే'

అంటే జీవితంలో అది కల, అది నిజం అని సరిహద్దులు గీయడానికి, నిర్ణయాలు చెయ్యడానికి మనుషులు సిద్ధంగా వుంటారు. నిర్ణయాలు నిప్పుగుండాలు. సంశయాలు సంగ్రామాలు. అసలు విషాదం కల కాదు, నిజం కాదు. అది నిజం, అది కల అని సరి హద్దులు గీయడం విషాదం. కలని నిజంగా, నిజాన్ని కలగా అనువదించడం విషాద మంటున్నాడు.

ఈ తాత్విక చర్చని పతాక స్థాయికి తీసుకెళతాడు. అందనంత ఎత్తులకి తీసు కెళతాడు.

'నేనెవరో తెలీదు

కలనో, నిజాన్నో, అనువాదాన్నో తెలీదు

కలకీ తెలీదు నేనెవరో

తెలియకుండా పుడతాం కదా,

ఏమీ తెలియకుండానే మరణిస్తాం'

'ఇప్పుడు సూర్యుడూ లేదా నక్షత్రాలు

తరువాత

అంతే ఒకే మహామౌనం'

చువాంగ్ ట్జు లాగే నేనెవర్నో నాకే తెలీదు. కలనో, నిజాన్నో తెలీదు. అసలు కలకే నేను ఎవర్నో తెలీదు అంటూ మనం తెలిసి పుట్టామా? తెలిసి పోతామా? ఈ అనంతవిశ్వం కూడా అశాశ్వతం. మనకు కనిపించే నక్షత్రాల్లో కొన్ని కోట్ల సంవత్సరాల క్రితమే 'చని' పోయినవి వున్నాయి. ఇది కలా? కలలా కనిపించే నిజమా? అంటూ మనల్ని మహాశూన్యపు లోతుల్లోకి తీసుకెళతాడు ప్రసాద్.



# పసిపిల్లల పై పరమాద్భుత గీతం

**పసివాళ్ళ గురించి** ఎందరో ఎన్నో కవితలు రాశారు. జీవితంలో ఎంతో రాటుదేలిన తరువాత లేతగా కనిపించే పసివాళ్ళ గురించి కవితలు రాస్తారు. జీవితాంతం పసితనం నిలుపుకున్నవాళ్ళే పసివాళ్ళ గురించి కవిత రాయడానికి అర్హులు. వయసుమీద పడినా 'అనుభవధూళి'ని దులుపుకోగలిగిన తాత్వికస్థాయి వున్నవాళ్ళే పసివాళ్ళపై కవిత్వం రాయ డానికి తగినవాళ్ళు.

ప్రసాద్ అట్లాంటి సున్నితమైన వాడు, సుకుమారుడు. ప్రసాద్ తత్వాన్ని పరిశీలిస్తే చిరునవ్వు కూడా అతన్ని గాయపరుస్తుందేమో నన్నంత సున్నితంగా వుంటాడు. అతనిలో ఉత్సాహం, ఆశ్చర్యం, అన్వేషణ పసిమనసువే.

నేనెప్పుడో నలభై ఐదు సంవత్సరాల క్రితం రాసుకున్న పద్యం యిప్పటికీ ప్రసాద్‌లాంటి సుకుమారులకు వర్తిస్తుంది

'పలుచని నీటితుంపురుల పాటున కోర్వగనోపనట్టి ఈ
తలిరులు దుమ్ముపైన బడి తల్లడమందుచునుండ, ఆ పయిన్
ఖలుడగు సూర్యుడిట్టి అవకాశము వచ్చెనటంచు, కాంతి సే
నల నుసికొల్పె మీద పవనమ్ములు వీచుచు ఏచుచుండెడిన్'

ప్రసాద్ కవితలోకి వద్దాం..

'ఏలోకం నుంచి వస్తారో ఈ పిల్లలు
ఈ కొత్త ప్రపంచాన్ని తేరిపారజూస్తారు
అక్కడ వాళ్ళు సంగీతంతో సంభాషిస్తారేమో
మన ఎదగని భాషని వాళ్ళ సంగీతంలోకి అనువదించుకుంటారు.
వాళ్ళ లోకంలో జీవించటమంటే నర్తించటమేమో
ఇక్కడ కూడా అల్లరి లయబద్ధంగా చేస్తారు'

ప్రసాద్‌కు అన్నీ ఆశ్చర్యమే. పిల్లలకూ అన్నీ ఆశ్చర్యమే. ఏ అజ్ఞాతలోకాల్నించో వచ్చిన అమరగీతికలు ఈ పసివాళ్ళు అంటున్నాడు. పిల్లలు ఒక్కక్షణం వూరుకోరు, ఆడు తారు, పాడుతారు, గంతులేస్తారు, అల్లరి చేస్తారు, తమ ప్రపంచాన్ని తాము సృష్టించు కుంటారు. అది ఆనందప్రపంచం. వాళ్ళు దేవదూతలు. ఆ లోకంలో వాళ్ళు ఆనంద నర్తనం చేస్తారు. అందుకే ఇక్కడా అలాగే చేస్తారంటున్నాడిలా శ్రీశ్రీ.

'పాపం, పుణ్యం, ప్రపంచమార్గం
కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా
అయిదారేడుల పాపల్లారా!' అన్నాడు.

శ్రీశ్రీ ప్రాపంచికుడు. అతీతస్థితికి అతీతుడు. ప్రపంచంలోని సరంజామాతో పిల్లల్ని చూస్తాడు. అవేమీ లేని వాళ్ళు పిల్లలని అంటాడు. వాళ్ళు అలా ఎందుకున్నారు? ఎక్కడినించి వచ్చారు? అంటే సశాస్త్రీయ పరిభాషలో ఆయన దగ్గర సమాధానాలుంటాయి. జీవితాన్ని దాటిన చర్చను ఆయన పరిహరిస్తాడు, పరిహసిస్తాడు.

ప్రసాద్ దృష్టి వేరు.

'పిల్లలకి పుట్టామని తెలీదు, చనిపోతారని తెలీదు
అవి లేని లోకం నుండి వచ్చారేమో అవి వాళ్ళకి అర్థం కావు'

పిల్లలకి జనన,మరణ స్పృహ వుండదు కదా! వాళ్ళు అవి లేని లోకం నించి వచ్చారు గనక, వాళ్ళకి ఆ స్పృహ వుండదంటున్నాడు.

పిల్లలు పెద్దలవుతారు. తప్పటడుగులు దాటి భూమిమీద నిటారుగా నిలబడి ముందుకు సాగేదశ వస్తుంది. ఆ సందర్భం గురించి..

'పిల్లలు తపతపా అడుగులేస్తూ
మనలోకం లోకి నడుస్తూ ఉంటారు.
వాళ్ళ అడుగులలో చివరిసారి ప్రతిఫలిస్తూ
ఆ లోకపు సౌందర్యం అదృశ్యమవుతుంది!' అంటూ మన కళ్ళ ఎదుటే ఆ సౌందర్య లోకం మాయమవడాన్ని మనకు చూపుతాడు. మనం పిల్లల్ని పట్టుకుని నడిపిస్తాం. తప్పటడుగులు వేస్తూవుంటే తన్మయం చెందుతాం.

చివర్లో ఒక అపూర్వ ఆకాంక్షని తెలుపుతాడిలా..

'వాళ్ళ చేతులు పట్టుకుని నడక నేర్పుతామా
ఎపుడైనా వాళ్ళిటు రావటం మాని
మననే అటు తీసుకుపోతే బాగుండునని ఎదురుచూస్తాం'

వాళ్ళని నడిపిస్తూ ప్రపంచంలోకి మనం తీసుకురావడానికి ప్రయత్నిస్తాం. వాళ్ళే మనని వాళ్ళ లోకంలోకి తీసుకుపోతే బాగుండు కదా, అంటాడు. తీరని కోరికయినా అది తియ్యని కోరిక!



# పరవశాన్ని పంచే ప్రసాద్

**బివివి ప్రసాద్** కవిత్వం ఒక తాత్విక తన్మయ తరంగం. జీవితపు లోతుల్ని సందర్శించి అనుభూతి గాఢతని ఆలపించే కవి ప్రసాద్.

పదాల పటాటోపం, అలంకారాల ఆర్భాటంలేని కవి. చివురుటాకు కదిలినా, చల్లగాలి తగిలినా, సన్నటి చంద్రుడు మెదిలినా, పిల్లమేఘం సాగినా, పసిపాప నవ్వినా అతని ఆనందానికి అంతుండదు. జీవన రహస్యాన్ని పసికట్టిన జీవనమాధుర్యం తెలిసిన కవి ప్రసాద్.

ప్రసాద్ అభివ్యక్తిలో ఆయన అధ్యయనం అంతర్లీనంగా వుంటుంది. ఆయన ఆదిభౌతిక, ఆధ్యాత్మిక చింతన విడదీయడానికి వీలుపడనంతగా కవిత్వంలో కలిసిపోతుంది.

'నిద్రలో పాపాయి నవ్వింది
తల్లి చెప్పింది పాపాయితో దేవుడు మాట్లాడుతున్నాడని
మనకి దేవుడు లేడు కానీ, దేవుడంటేనే లేకపోవడం
మబ్బు మరకలు లేని నిర్మలాకాశం దైవం'

జ్ఞానాన్ని పొందిన వ్యక్తుల మాటల్ని గాఢంగా పరిశీలించిన వాళ్ళు మాత్రమే ఈ మాటల లోతు తెలుసుకుంటారు. కల్లాకపటం లేని పసిపాపల్లో దేవుడుంటాడని సాధారణ జనం కూడా అనుకుంటారు. అనుకోవడానికి, ఆంతర్యపు లోతుల్ని దర్శించడానికి రెంటికీ ప్రసాద్ కవిత్వం అవకాశం ఇస్తుంది. సృష్ట్యాది నించే మనిషి ఏదో కోల్పోయాడు. దైవా నికి దూరమయ్యాడు. సహజత్వాన్ని కోల్పోయాడు. ఆ సంగతిని ప్రసాద్ అపూర్వంగా ఆవిష్కరించాడు. మనిషిని చూసి జాలిపడేలా చేస్తాడు.

వ్యక్తీకరణలో ఆయన భావాలు ఎక్కడా ఉద్రేక పడవు. ఏదో సౌందర్య స్పృహ ఆయన అక్షరాల్ని అల్లుకుని ఒక నిర్మలత్వాన్ని ఆపాదించినట్లనిపిస్తుంది. చెప్పదలచుకున్నది కవిత్వ సరిహద్దులకు లొంగే వుంటుంది. సౌకుమార్యం లేని పదం ఆయన కవితలో వుండదు. తన కవిత్వం గురించి ఆయనకు విస్పష్టమయిన అభిప్రాయాలున్నాయి. ఒక విశాల తాత్విక భూమికలో తన కవిత్వపు ఉనికిని దర్శిస్తాడు.

'విఫలమయిన కాంతి రంగులుగా కనిపిస్తుంది
అన్నీ అంతే, సత్యం నించీ వైఫల్యమే జీవితం,
ప్రపంచంపాలపుంతలు' అంటూ మన మనసును మహా విస్ఫోటనానికి గురిచేస్తాడు. అనంత వ్యాఖ్యానానికి ఆస్కారమిచ్చే ఆయన మాటలు మనల్ని ఆలోచనా లోకానికి తీసుకు

పోతాయి. ఒక అనంత శూన్యమే అనంత సృష్టికి పునాది అన్నసంగతిని సాదాసీదా మాటల్లో...

'ఓ మంచు కణం, ఓ తృణం, ఓ నేను

అది కూడా క్రమంగా చెదిరిపోవచ్చు' అంటాడు జీవన పరిమితులు తెలిసిన దార్శనికుడు.

తమని తాము సంస్కరించుకోలేని వాళ్ళు జనాల్ని సంస్కరించడానికి సిద్ధపడతారు. ప్రసాద్ మనసు లోతులు తెలిసిన కవి. మనిషి జీవితకాలం పసిపిల్లల్లా జీవించాలంటాడు. జీవన పరిమితుల్ని తెలుసుకున్నాక, అనుభవాలన్నీ పువ్వుల్లా విచ్చుకున్నాక అవి తన ఆంతర్యాన్ని అతనిముందు పెడతాయి. ఆయన విలక్షణ దృష్టి మనకు తెలియని కోణాల్ని ప్రదర్శిస్తుంది.

ప్రేమించడం తెలిసినవాడే కవి. సమస్త ప్రపంచాన్ని ప్రేమించగలిగిన ప్రేమమూర్తి ప్రసాద్. ప్రసాద్‌కి ఆద్యంతాలు ప్రేమే. రాత్రింబవళ్ళు ప్రేమే. మనం ద్వేషించినా మనల్ని దరహాసంతో అక్కున చేర్చుకునే అమరుడు ప్రసాద్.

ప్రేమించగలిగినవాడే ప్రకృతిని పరిశీలిస్తాడు. మనుషుల్ని పరిశీలిస్తాడు. ప్రేమించ లేని వాడు తన ఆవేశాన్ని ప్రేమిస్తాడు. తన ఉద్వేగాలకు బానిస అవుతాడు.

'నిన్ను నువ్వు తెలుసుకో' అన్నది ప్రతి మతం చెప్పే అంతిమ సారాంశం. ప్రకృతి ఇంకోలా కావాలని, ఇంకొకరిలా మారాలని ఎప్పుడూ అనుకోదు. మనిషి ఒక్కడే ఇంకొక డిలా మారాలని ఆరాటపడతాడు.

తనని తాను తెలుసుకున్న వ్యక్తి, జీవనానందమే కవిత్వరహస్యమని, ప్రతి మనిషీ ఒక కావ్యమని ప్రసాద్ తెలుసుకున్నాడు. ప్రతి వ్యక్తీ స్వయంజ్వలితుడని అతనికి తెలుసు. సృష్టిరహస్యం కనిపెట్టిన శాస్త్రజ్ఞుడు ఈ కవి.

ఆనందో్బ్రహ్మ అన్న ఉపనిషద్వాక్యాన్ని ఎందరో ఎన్నిరకాలుగానో వ్యాఖ్యానించారు.

'ఆనందమే ప్రేమ. ఆనందమే త్యాగం, సాహసం, స్వేచ్ఛ

ఆనందమే నిరంతర ముక్త బంధం

కారణాల సంకెళ్ళని ఆనందం తెంచుతోంది

మిత్రమా! అకారణంగా ఆనందించు

నువ్వు ఎవరూ ఎరుగని ఏకాంతపు ఆనందానివి' అంటున్నాడు.

ఆనందం తెలిసిన వ్యక్తికి అన్నీ తెలుస్తాయి. విషాదం వున్న వ్యక్తికి విషాదం ఒకటే తెలుస్తుంది. ఆనంద రహస్యం తెలిసిన వ్యక్తి దుఃఖాన్ని కూడా అర్థం చేసుకుంటాడు. కవులు సౌందర్యమే ప్రధానంగా వున్నవాళ్ళు. సౌందర్యానికి సత్యం తోడయితే కవిత్వం పరిపూర్ణమవుతుంది.

పరిపూర్ణుడయిన ప్రసాద్‌కు పరవశం తప్ప మరేమీ తెలీదు.



# ఆకాశమే అతని ఆదర్శం

**ఇస్మాయిల్‌గారు** 'చెట్టు నా ఆదర్శం' అన్నారు. ప్రసాద్‌గారు ఆ మాట అనకపోయినా ఆకాశాన్ని అపూర్వంగా వర్ణించారు. ఆకాశం అనంతం. మనం, ఈ గ్రహాలు, పాలపుంతలు అన్నీ ఆకాశంలో భాగాలు కదా! మనిషి ఆకాశంలా వుండాలంటాడు ప్రసాద్.

'అంతస్సారానికి చెందిన అనేక భావాలకి ఆకాశం ప్రతీక
ఉద్వేగాలతో కలుషితం కాని మనస్సుకీ
అనుభవాలతో కలత చెందని మెలకువకీ
ఆలోచనల ఆటంకం లేని స్ఫురణకీ
కోరికల వెలితి లేని ఆనందానికీ
ఏ బంధం ఆపలేని స్వేచ్ఛకీ
సరిహద్దులు తెలీని విశాలత్వానికీ ప్రతీక ఆకాశం'

ఆకాశమంటే ఏమిటి? నీకూ నాకూ కనిపించే నీలాకాశం, అనంతశూన్యంగా విస్తరించిన ఆకాశం అనంత ఆలోచనలకి ఆస్కారమిస్తుందని ఎంతమందికి తెలుసు. అది భావుకులకే తెలుసు. తోడే కొద్దీ చెలమలో నీళ్ళు వూరినట్లు ఆకాశాన్ని చూస్తున్నకొద్దీ కవి హృదయంలో అంతులేని భావాలు పొంగిపొర్లుతాయి. మన ప్రాపంచికమయిన రాగ ద్వేషాలతో కలుషితం కాని స్వచ్ఛత ఆకాశంలో వుంది. ఆ విశాలత్వంలో మన ప్రపంచమే అత్యల్పం.

ఆకాశం ఒక అనంతసాక్షి. నువ్వు నవ్వుతున్నా, ఏడుస్తున్నా, బాధపడుతున్నా,

ఆనందిస్తున్నా కళ్ళప్పగించి చూస్తూనే వుంటుంది. ఆ ఆకాశం కింద అన్నీ కదిలిపోతాయి.

ఓషో My way - The way of white clouds అన్నాడు. నా మార్గం తెల్ల మేఘాల మార్గమన్నాడు. వర్షించిన మేఘాలు తెల్లమేఘాలుగా మారి సాగుతూ వుంటాయి. ఎంతో ఉల్లాసంగా సాగుతాయి. నిర్బాధ్యతగా, నిరామయంగా సాగుతాయి. అట్లాంటి మేఘాలుకూడా ఆకాశం కిందనే సాగుతాయి. ఆకాశం వాటి బరువును, తేలిక తనాన్నీ కూడా చూస్తూనే వుంటుంది.

'మనం ఆకాశం పిల్లలమనీ, చిన్నచిన్న ఆకాశాలమనీ
మనని ఎప్పుడూ వదలని అమ్మలాంటి ఆకాశాన్ని
మనమే తప్పించుకొని, తప్పిపోయామనుకొని
సదా వెదుకుతూ తిరుగుతున్నామని అతను గమనించాడు'

ప్రసాద్ భావుకత్వంతో ఆకాశానికి స్వచ్ఛతని, ప్రేమని, అమ్మతనాన్ని ఆపాదించాడు. ఆకాశం ఏదీ కాదనదు. నిజానికి ఆకాశమంటే విశాల ఆహ్వానం కదా!

కవి ఆకాశంలో అమ్మని చూశాడు. ఆకాశంలో అమ్మని చూడడం కన్నా మించిన అదృష్టమేముందని అంటున్నాడు.

అతను తనలోకి తిరిగి, తన ఆకాశం కనుగొని తన ఆకాశంలో బహుజన్మల దుఃఖం నుండి విశ్రాంతి పొంది. ఆకాశం నుండి అప్పుడే పుట్టిన ఆకాశంలా మనల్ని పలకరిస్తాడు. మన లోపలి నిర్మలాకాశానికి అద్దమై మనముందు నిలుస్తాడు.

ప్రసాద్ నిర్మలమయినవాడు. నిత్య జ్వలితుడు. అతనిలో ఏదో దుఃఖముంది. అంతు బట్టని విషాదముంది. ఒక మార్మిక మందహాసముంది. ప్రతి అనుభవాన్నీ తాత్వీకరించగల నైపుణ్యముంది. అన్నిట్నీ సమన్వయపరుస్తాడు. సుఖదుఃఖాదిక ద్వంద్వాతీత స్థితికి తీసు కుపోతాడు.

అతను ప్రపంచానికీ, ఆకాశానికీ అనుసంధానకర్త. అతను ఆకాశం నుంచి పుట్టిన ఆకాశం. నీలో ఆకాశం వుంది. నాలో ఆకాశం వుంది. తను దర్పణమై మనలోని ఆకాశాన్ని మనకు ప్రదర్శిస్తాడు.

మనందరం ఆకాశం పిల్లలమని అంతిమ నిర్ణయం చేస్తాడు.



# వెన్నెల్లో తేలే కవి

**ప్రసాద్ పదాలు** సన్నటి తీగల్లా సాగి వెన్నెల పూలు పూస్తాయి. అతని మనసు నించి సాగిన పరిమళం ఏదో లోకం నించి వచ్చినట్లనిపిస్తుంది. ఒక మధుర మనోహర, భౌతికేతర వాతావరణాన్ని ఆవిష్కరిస్తుంది.

'చలికాలపు రాత్రి నిర్మలాకాశంలో చందమామ ప్రకాశిస్తోంది
ఏవో శబ్దాలు ఇంటి ముందు నుండి వెళ్ళిపోయాయి
పొగమంచు వెన్నెలలో మంచుముద్దలా కరుగుతోంది చందమామ'

ఒక మనోహరమయిన, మహా ఆహ్లాదకరమయిన వాతావరణాన్ని సృష్టిస్తాడు. అతను సృష్టిస్తాననడం కన్నా, అది అతన్ని సృష్టిస్తుందనడం మేలు. ప్రాచీన గ్రంథాల్లో భక్తుల భక్తి పారవశ్యం లాంటిది ప్రసాద్‌లో ప్రకృతి ప్రేమగా రూపొందింది. నిర్మలాకాశంలో, చలికాలపు వేళ నిర్మలంగా, నిశ్శబ్దంగా వెలిగే చంద్రుణ్ణి వూహించుకోండి. లేదా జనసంచారం లేని దూరతీరాలకు వెళ్ళి ఆ దృశ్యాన్ని దర్శించండి. అక్కడ శబ్దాలుండవు. పొగమంచు వెన్నెలలో మంచుముద్దలా కరుగుతోందట చందమామ. ఒక లోలోతుల గానం మనల్ని తాకుతుంది. ఇతను పద్యం రాస్తున్నాడా? పాట పాడుతున్నాడా? అన్న సందేహం కలుగు తుంది. దృశ్యానికి అతను బానిస. దృశ్యం ముందు అతను మోకరిల్లుతాడు. దృశ్యంలో అదృశ్యమవుతాడు.

'ఆకాశంలో పక్షి ఒకటి చప్పుడు లేకుండా వెళ్ళిపోయింది.
సాలెగూడు వెన్నెలలో నెమ్మదిగా కదులుతోంది చందమామ.
ఏదో ఒక ఆలోచన నెమ్మదిగా పలకరించి వెళ్ళిపోయింది
నల్లని మెరిసే రాత్రిలో ఒంటరిగా తిరుగుతోంది చందమామ'

సందర్భం కాకున్నా ఒక సంఘటన గుర్తుకొస్తోంది. ఓషో తన 'సెక్స్ టు సూపర్ కాన్షియస్' అన్న గ్రంథం విపరీతంగా అమ్ముడుపోయిందని, తనవి ఆరువందల పైచిలుకు గ్రంథాలయినా అందరూ ఆ గ్రంథానికే ఎగబడ్డారని చెబుతూ జర్మన్ కవి హెన్రిక్ హైనె

జీవితంలోని ఒక అనుభవాన్ని వివరించాడు. హెన్రిక్ హైనె చంద్రునిమీద అపూర్వమయిన కవితలు రాసిన కవి. అతను ఒకసారి అడవిలో దారి తప్పాడు. జంతుభయంతో రాత్రిళ్ళు చెట్లెక్కేవాడు. అట్లా మూడు రోజులు గడిచాయి. ఆకలితో నకనకలాడాడు. మూడో రాత్రి చెట్టుపైనవుంటే దూరంగా నిండుచంద్రుడు ఆకాశంలోకి వచ్చాడట. ఆ చంద్రుడి అందచందాలకు బదులుగా, అతనికి చంద్రుడిలో బ్రెడ్‌ముక్క కనిపించిందట. అట్లా లైంగిక అణిచితేతకు గురయిన వాళ్ళకు తన పుస్తకాల్లో సెక్స్ కనిపిస్తుందన్నాడు.

సాలెగూడు లాంటి వెన్నెలలో చందమామ నెమ్మదిగా కదుల్తోందట. ఏదో అవ్యక్త ఆలోచన నెమ్మదిగా పలకరించిపోయిందట.

చంద్రుణ్ణి నిరంతరం చూస్తున్న అతనికి విచిత్రానుభవం, వింత అనుభూతి కలిగింది.

ప్రతి విరామం తరువాత ఇతను చందమామలోకి కొత్తగా ప్రవేశిస్తున్నట్లు తెలుసుకున్నాడు. తను తనకు తెలియకుండానే తను చంద్రుడిలోకి ప్రవేశించాడు.

చంద్రుడిలోకి ప్రవేశించిన ఆ వ్యక్తి గురించిచెబుతూ..

'బహుశా కోటి చందమామల కాంతి ఏదో

ఇతను ఇక్కడికి వచ్చి, వెళ్ళటానికి ముందూ, వెనకా ఉండి ఉంటుంది

కాంతిలోకి వెళ్ళే సరదా అయిన ఆట కోసమే

కాంతిలో నుండి ఇక్కడికి వచ్చి వుంటాడు

లేకపోతే ఇతనికి, మానవ ప్రపంచంకన్నా

చందమామ ఎందుకు బాగా అర్థమవుతుంది' అంటాడు.

బహుశా అతను స్వర్గలోక వాసి అయివుంటాడు. చంద్రలోకవాసి అయివుంటాడు. ఎందుకో ప్రపంచాన్ని దర్శించడానికి వచ్చి వుంటాడు. జర్మన్ మహాకవి గోథె 'మనం రాత్రిపూట ఆకాశంలోకి చూస్తే మనం మరచిపోయిన, దారి తప్పివచ్చిన మన మాతృభూమి ఏదో స్ఫురణకు వస్తుంద'ంటాడు.

ప్రసాద్ మనకు కావలసినంత వెన్నెల పంచి పెడతాడు.



# అహంకారం అదృశ్యమైనపుడు...

**ప్రపంచంలో** యుద్ధాలు జరుగుతూ వుంటాయి. క్రూర కృత్యాలు జరుగుతూ వుంటాయి. మారణహోమం జరుగుతూ వుంటుంది. అయినా మనల్ని అప్పటికీ మనుషులుగా నిలిపేది మనలోని దయ. మనలోని సానుభూతి. ఇతరుల కష్టాలకు స్పందించడం, సంచలించడం ఎదుటివాళ్ళ బాధలకు మనం కన్నీళ్ళు నింపడం ఒక అనునయం, ఒక ఓదార్పు.

అదంతా హృదయమున్నపుడు జరిగే పని. హృదయం వుంటే నువ్వు దుర్మార్గాలు చెయ్యవు. అప్పుడు దౌర్జన్యముండదు, ప్రేమ ఉంటుంది.

'ఎప్పుడూ విసుక్కునే కొడుకు తల్లిపాదాలు తాకి దీవించమన్నపుడు
ఆమె కళ్ళలో ఎన్నడూ చూడని కన్నీరెందుకొస్తుంది'
'గాయపరిచాను, క్షమించమన్నపుడు
అప్పటి వరకూ వెలవెలబోతున్న
భార్య కన్నులవెంట ఆపలేని ధారలెందుకొస్తాయి'

ఇట్లా పశ్చాత్తాపం మనుషుల్ని మెత్తబరుస్తుందంటాడు. మన అహాన్ని మనం వదులుకున్నపుడు మనవాళ్ళయినా, ఇతరులయినా మనకు దగ్గరవుతారు. తల్లి ఆశీర్వాదం మనకు అవసరం. భార్యతో సహజీవనం అనివార్యం. అక్కడ తగ్గిరాక తప్పదు. తగ్గిరావడమంటే మన అధికారానికి, అహానికి నీళ్ళు వదులుకోవడం.

'లేదనుకున్న మంచితనం ఎదురైన ప్రతిసారీ
ఎవరినైనా మంచితనంతో గెలుస్తూ గెలిపించిన ప్రతిసారీ
మన కళ్ళెందుకు చెమరుస్తాయి. మన కంఠాలెందుకు రుద్ధమౌతాయి'

కారణం అక్కడ మనం కరిగిపోతాం. మనం కరగడమంటే మన అహం మాయం కావడం. మనం మాయమయిన చోట ప్రేమ విస్తరించి వుంటుంది. మంచితనంతో గెలుస్తూ గెలిపిస్తూ పోవడమంటే ఓడి గెలవడమే. అది ఆత్మికమైన సంగతి. అప్పుడు మాటల

కతీతమైన సందర్భం మనముందు కొస్తుంది. కళ్ళు చెమరుస్తాయి. కంఠం గద్గదమవుతుంది.

ఈ సందర్భంలో వచ్చే పరిణామాన్ని మృదువయిన వాక్యాల్లో ప్రసాద్ మన ముందుంచుతాడు.

బహుశా అప్పుడు మనలోపలికి మనం చేరుకొంటామేమో
మాయాలోకాన్ని కడుగుకొని మనని మనం నిజంగా చూసుకొంటామేమో
దేవుని వంటి మనం దారితప్పిన పురాస్మృతిలోకి మేలుకొంటామేమో

కృష్ణశాస్త్రిగారు 'అడుగడుగున గుడివుంది, అందరిలో గుడివుంది' అన్నారు. 'ఆత్మ వత్ సర్వభూతాని' అన్నారు. 'అహం బ్రహ్మాస్మి' అన్నారు. మనం ఈ అనంత ప్రకృతిలో భాగాలమని, దైవత్వంలో భాగాలమని గుర్తించారు. ఆత్మ, పరమాత్మ వంటి మాటలు అందుకే పుట్టాయి.

ఇట్లా మనం తగ్గి వచ్చినపుడు, మనం మన లోపలికి ప్రయాణిస్తామంటాడు ప్రసాద్. మనల్ని మనం గుర్తిస్తామంటాడు. మనల్ని మనం మరచిపోయినవాళ్ళం. మనం దేవతలం. అప్పుడు లోపలి ప్రయాణంలో మన గురించి మనం తెలుసుకుంటామంటాడు.



# ఎందుకీ కవి తాత్వికుడయ్యాడు?

**ప్రతిదానికీ** కారణముంటుంది. కారణానికీ కారణముంటుంది. ప్రశ్నకు అందని సమాధానాలుంటాయి. ప్రపంచమెందుకుందంటే, ఈ విశ్వం ఎందుకుందంటే మనం ఏమీ చెప్పలేం.

కానీ ప్రపంచంలో మనమున్నాం. మనం ఎందుకు ఇలా వున్నామో, ఎందుకు ఏడుస్తున్నామో, ఎందుకు దుఃఖిస్తున్నామో మనం చెప్పగలం. మనిషి మనస్తత్వం పరిసరాల్ని బట్టి రూపొందుతుందని అంటూ వుంటారు.

ప్రసాద్ ఎందుకు తాత్వికుడయ్యాడు? పువ్వులా ఇంత సున్నితంగా ఎందుకు మారాడు? ఆ విషయాల్ని అతనే వివరించాడు. సరళమయిన భాషలో, సులభతరంగా వివరించాడు.

'బాగా చిన్నపుడు, ఆలోచించటం నేర్చుకుంటున్నపుడు
ముక్తి కోసం మునులు తపస్సు చేస్తారని చదివి
జీవితం ఇంత అందమైంది కదా! ఆనందనిధి కదా!
జన్మ ఒక శాపమైనట్లు, పాపమైనట్లు వాళ్ళెందుకు స్వేచ్ఛకోసం తపించారని
జనం మధ్య వెచ్చగా బ్రతకడం మాని అరణ్యాలకు వలస వెళ్ళారని
అమాయకంగా, వాళ్ళంటే దయగా తలచుకునేవాడిని'

అంటూ పసితనంలో సర్వసంగపరిత్యాగుల గురించి జాలిపడ్డాడు. కానీ పసితనం అక్కడే ఆగదు కదా! రోజులు గడిచేకొద్దీ ఎన్నో అనుభవాలు, ఆటంకాలు, పరిస్థితులు, కాలం క్రమక్రమంగా శరీరాన్నీ, మనసునీ మార్చుకుంటూ పోయాయి.

అట్లా జరుగుతూవుంటే ఒక క్షణం తనకు తను వేరయి అతను మాయమయిన బాల్యాన్ని తన పక్కన నిలుపుకుని వచ్చిన మార్పుని పరిశీలించాడు.

'జీవితం ఆకాశంలా సుకుమారం కాదని, విశాలం, నిత్య నిర్మలం కాదని
నా ఆకాశం నాకు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయిందని
నేను బంధించబడ్డానని, నా ప్రతి కదలికా, నవ్వూ, ఏడుపూ బంధించబడ్డాయని
నేను ఉండటమూ, వెళ్ళటమూ కూడా నా చేతుల్లో లేవని తెలిసింది'

మార్పు మన చేతుల్లో లేదు. మధురమయిన బాల్యం మాయలా అదృశ్యమయింది. చెప్పకుండానే వెళ్ళిపోయింది. ఎక్కడ వెతికినా దొరకదని తెలిసిపోయింది. తను బందీనని, తన రాగద్వేషాలు నియంత్రించబడ్డాయని, తను ఏదో కోల్పోయానని, కోల్పోవడం, పొందడం, చివరికి ఉండడమూ, వెళ్ళడమూ కూడా మన చేతుల్లో లేదని తెలిసిపోయింది.

అప్పుడు తెలిసి వచ్చింది. వైరాగ్యమన్నది ఎందుకు కొందర్ని వెంటాడుతుందో గ్రహించాడు.

'మునులెందుకు స్వేచ్ఛ కోసం తపస్సుచేస్తారో అర్థమైంది
సాటి మనుషులకన్నా, చివరికి అన్నంకన్నా, గాలికన్నా
స్వేచ్ఛ ఎంత ప్రియమైనదో, అవసరమైనదో తెలిసివచ్చింది
మనిషి చేయవలసిన పనికి
వ్యతిరేకంగా, ఎంతవేగంగా వెళుతున్నాడో అర్థమైంది
నాపైనా, వెచ్చని మానవుల గుంపులపైనా దయ కలిగింది
అప్పుడు నా ప్రయాణం మొదలైంది'

సర్వసంగ పరిత్యాగుల్లో పలాయనం కాదు, అన్వేషణే, స్వేచ్ఛే ప్రధానాంశాలంటున్నాడు. కారణం మనుషులు సౌకుమార్యతని, సౌమ్యతని, అనురాగాన్ని, కరుణను కోల్పోయినందువల్లే వైరాగ్యభావన ఏర్పడుతోందని, పరస్పరప్రేమ, సహకారం వుంటే అంతా సజావుగా వుంటుందని, ప్రపంచం స్వర్గమవుతుందని అంటున్నాడు.

అది గ్రహించినందువల్లే అతను దయాతరంగుడై ప్రయాణం ఆరంభించాడట!



# ఆధ్యాత్మికతకు అందాలు

**కొందరు** బయటికి ప్రయాణిస్తారు. కొందరు లోపలి ప్రయాణం చేస్తారు. బయటికి ప్రయాణం చేసేవాళ్ళ ఎదుగుదల మనకు కనిపిస్తుంది. పేరు, పలుకుబడి, ఆస్తి, అధికారం వాళ్ళు అందుకుంటారు. వాళ్ళకు మనం గొప్పతనం ఆపాదిస్తాం. ప్రపంచంలో పైకి రావడమంటే అదే!

కొందరు లోపలికి ప్రయాణం చేస్తారు. వాళ్ళు అతి కొద్దిమంది. ప్రపంచంనించి వాళ్ళు అభినందనలు, సత్కారాలు ఆశించరు. వాళ్ళ ప్రయాణమే వాళ్ళ పరవశం.

బివివి ప్రసాద్‌కి ఆంతరిక ప్రయాణం అంతరిక్షయానం లాంటిదే. అది నిరంతరం కొనసాగుతూ వుంటుంది. అతను అందుకున్న ఎత్తులు, ప్రయాణించిన లోతులు మన వూహకందనివి. అతని భాష గొప్ప సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని సాధించింది.

అతని భావాలు మహాతాత్వికుల చింతనలు. ఐతే తాత్వికులకు లేని కవిత్వదృష్టి ప్రసాద్‌కు ఉంది.

ఆధ్యాత్మికతకు అందాలద్దిన కళాశీలి ప్రసాద్

నిజమైన నిర్లిప్తతలో, ఉదాసీనతలో మనం మనంగా నిలబడి నిఖిల ప్రపంచాన్నీ నిర్మలంగా చూస్తాం. ప్రసాద్ అన్నిటినీ ఆహ్వానిస్తూ దేనిలోనూ పడి కొట్టుకుపోని ఆకాశం లాంటివాడు.

'సృష్టికి తానే కారణమై ఏమీ ఎరగనట్లుండే స్వచ్ఛతకీ
అన్నిటినీ తనలో పొదవుకుని అన్నిటిలో ఒదిగి
ఏదీ తనది కాదన్నట్లుండే నిర్మల ప్రేమకీ
ఉండీ లేనట్లుండే ఉదాత్త స్వభావానికీ ఆకాశం ప్రతీక' అంటాడు.

అతనొక ఆకాశం, దేన్నీ కాదనడు, దేన్నీ కావాలనడు. తన స్వేచ్ఛను ఎక్కడా మలినపడనివ్వడు.

సామ్రాజ్యాల్ని సాధించడం గొప్పకాదు. ఆత్మ సామ్రాజ్యాన్ని సాధించడం అన్నది అపూర్వ విషయం. సుకుమార సామ్రాజ్యాన్ని సృష్టించుకోవడం గొప్ప సంగతి. ప్రసాద్ మనః ప్రపంచంలో కాఠిన్యముండదు. కరుణ ఉంటుంది. దౌర్జన్యముండదు. దయ వుంటుంది. ఆ సామ్రాజ్యాన్ని మనం దురాక్రమించలేం. కారణం అక్కడ అనురాగమొక్కటే

అన్ని వేళలా అందుబాటులో వుంటుంది. మనతో ఘర్షించని వ్యక్తిని మనం జయించలేం. అహంకారమున్నపుడే సంఘర్షణ వుంటుంది. అన్నిటికీ ఆమోదద్వారాలు తెరచుకున్న ఈ సౌమ్యుడిని ప్రేమించడమొక్కటే చెయ్యగలం.

ప్రసాద్ ప్రవహించే నీళ్ళలాంటివాడు. అడ్డంగా నిల్చున్నా ప్రవాహం పక్కకు తొలగి సాగిపోతుంది. ప్రసాద్ ప్రశ్నలకు అందడు. సమాధానాలకు లొంగడు. తెల్లని మేఘంలా తేలిపోతాడు. మధుర పరిమళాన్ని నింపుకున్న మందపవనంలా ముందుకు సాగిపోతాడు. నిర్ణయాలకు లొంగడు. స్వేచ్ఛ అతని వూపిరి. నిజమైన స్వేచ్ఛ బాల్యంలో ఉందని, మనుషులు బాల్యాన్ని కోల్పోయి బందబారిపోతారని బాధపడతాడు.

దైవత్వం అక్షరాల్లో ఉంటుందంటే మనం నమ్మం. ఊహల్లో దయ విశ్రాంతి తీసుకుంటుందంటే విశ్వసించం. వాక్యాలు పూలహారాల్లా వుండొచ్చంటే నమ్మబుద్ధి కాదు. 'నా అక్షరాలతో భగవంతుని వస్త్రాన్ని నేస్తాను' అన్నాడు జర్మన్ మహాకవి గోథె. 'వాగ్భూషణమ్ సుభూషణమ్, భూషణముల్ నశియించునన్నియున్' అన్నాడు భర్తృహరి. బివివి ప్రసాద్ ఏ తపః ఫలితంగాసాధించాడో ఈ అక్షరాల్ని, సంస్కారాన్ని, సౌమ్యతని. ఆ జ్ఞానాన్ని సౌందర్యంలో అద్ది ఆరాధిస్తున్నాడు. జీవితం అహంకార చలనం కాదు, జీవితం ఆనంద గమకం. ఆనందంగా జీవించడానికి ఐశ్వర్యం అక్కర్లేదు. మనోహరంగా జీవించడానికి మణిమాణిక్యాలక్కర్లేదు. ప్రేమ, అనురాగం, దయాంతరంగం వుంటే అపూర్వంగా జీవించవచ్చు, పోల్చుకోకుంటే ఉల్లాసంగా బతకవచ్చు.

'దృశ్యమేదయినా చూడడమే ఆనందంగా
శబ్దమేదయినా వినటమే ఆనందంగా
రుచి ఏదయినా ఆస్వాదించటమే ఆనందంగా
జీవితమెలా ఉన్నా జీవించటమే ఆనందంగా' ఉండడం తెలిసినవాడు ప్రసాద్. ప్రసాద్‌ది సరళ మార్గం, సహజ మార్గం, సత్య మార్గం, సకల జనులకూ ఆమోద మార్గం.

'బానిసత్వాన్ని ప్రేమగా భ్రమించి మురిసిపోతామా
స్వేచ్ఛ తెలిసినవాడు రహస్యంగా సమస్తాన్ని ప్రేమిస్తాడనీ
బంధాలలో మునిగేవాడు రహస్యంగా తననీ ద్వేషిస్తాడనీ
మనం ద్వేషిస్తామని తెలిసి కూడా ప్రేమతో చెబు'తూ వుంటాడు.

బానిసత్వంలో వున్నవాడికి బానిసత్వం గురించి తెలీదు. ఈ తాత్వికుడు ప్రతి వ్యక్తినీ పరిశీలించి నువ్వు బానిసత్వంలో వున్నావని చూపిస్తాడు. ప్రతి సున్నిత కోణంలోకీ సూక్ష్మజీవిలా ప్రవేశిస్తాడు. మానవజాతి పట్ల అంతులేని ప్రేమను ప్రకటిస్తాడు.

తాత్వికమయిన మేలిముసుగు వేసుకున్న అతని కవితా సుందరి అందీ అందని చిరునవ్వుతో మనల్ని వూరిస్తూనే వుంటుంది.



# జీవితం ఒక ఉత్సవం

**జీవించడం** కాదు ప్రతిక్షణాన్నీ ఉత్సవంలా జరుపుకోవాలన్నాడు ఓషో. కారణం మనందరం ఆనందం నుంచే ఈ ప్రపంచంలో అడుగుపెట్టాం. మనం ఇక్కడ గోడలు కట్టడానికి రాలేదు. పూలు చల్లటానికి వచ్చాం. నవ్వడానికి వచ్చాం. నవ్వుల్ని పంచడానికి వచ్చాం.

ఈ స్పృహ కనీసం ఎప్పుడయినా మనసులో మెదుల్తుంది. అప్పుడు పట్టరాని పరవశం పరవళ్ళు తొక్కుతుంది.

'అప్పుడు నీ కందర్నీ పలకరించాలనిపిస్తుంది
పూలతో, పిట్టలతో, దారినపోయే మనుషులతో తోచిన మాటలన్నీ మాట్లాడాలనిపిస్తుంది'
'దేహాన్నొక కెరటం చేసి నర్తించాలనీ
నలుగురు పిల్లల్ని ప్రోగుచేసి పరుగుపందెంలో వాళ్ళతో ఓడిపోవాలనీ అనిపిస్తుంది'

నిజమేకదా! ఎవరికి వాళ్ళే తలుపు లేసుకుని వుంటారు. మా ఇల్లు, మా వాడు, మావాళ్ళు అంటూ అడ్డుకట్టలు వేసుకుంటారు. మనుషులు నడుస్తున్నపుడు తలుపులు మూసుకుంటూ, మోసుకుంటూ నడుస్తున్నట్లనిపిస్తుంది. పూలతో, పిట్టలతో, కనిపించిన మనుషుల్తో మాట్లాడాలని ఎంతమంది కనిపిస్తుంది? ఒక్క సుకుమారుడయిన కవికి మాత్రమే అనిపిస్తుంది. అందరూ మనవాళ్ళనుకున్నపుడే అది వీలవుతుంది. టోక్యోలో మనుషులందరూ రోడ్లమీదికి వస్తారు. పలకరిస్తారు, పులకరిస్తారు. అట్లా ప్రతిరోజూ వుండాలనుకుంటాడు ప్రసాద్.

ఈ క్రమంలో నిరాశ, కోరిక, భయం వుంటాయి. వాటిని కూడా ప్రపంచంతో పంచుకోవాలనిపిస్తుందంటాడు.

దయ వున్న దశ వుంటుంది.

'అప్పుడు గాయపడ్డ ప్రాణాలన్నిటినీ దగ్గరగా హత్తుకోవాలనిపిస్తుంది.

లోకం చేసిన గాయాలన్నీ పోనిద్దూ అని మరిచిపోవాలనిపిస్తుంది.

ప్రపంచాన్ని పసిబిడ్డను చేసి ఎత్తుకోవాలనిపిస్తుంది

అప్పుడు నీకు జీవితంమీద జీవితమంత ప్రేమ పుడుతుంది'

ప్రసాద్ చిత్రమయిన భావుకుడు. అతని ఆలోచన, అతని దారి వేరు. అతనిది దయామార్గం. ప్రపంచం పట్ల ఆయనకు అంతులేని జాలి. దుఃఖం వదిలి వెళ్ళిన అనాథలా ప్రపంచాన్ని భావిస్తాడు. అట్లాంటి ప్రపంచాన్ని పసిబిడ్డలా దగ్గరకు తీసుకోవాలంటాడు.

అతని ఉత్సవం ఉద్వేగభరితం కాదు. చాలా సౌమ్యమయింది. చిరునవ్వు లాంటి ఉత్సాహం, చిన్మయ ఉత్సవం.

పువ్వుని, నవ్వుని, పసిపాపని, సూర్యోదయాన్ని, ఆకాశాన్ని అన్నిటినీ కవి తాత్వికంగా చూస్తాడు. ఈ ప్రపంచాన్ని తన గంధర్వలోకంలో పరివర్తింపజేసుకుని ఉల్లాస ఉత్సవ గానం చేస్తాడు.



# సాక్షీభూతుడు

**ప్రసాద్** కంటికి కనిపించిన ప్రతి పువ్వునీ, నవ్వునీ, యింటినీ, నీటినీ, ఆకాశాన్నీ అన్నిటినీ పరిశీలిస్తాడు. పరవశిస్తాడు. అదే సమయంలో అన్నిటికీ అతీతుడుగా వుంటాడు. వాటి ఆంతర్యం గురించి వివరిస్తాడు. అవి దగ్గర వున్నపుడు ఒకలా, దూరంగా వున్నపుడు ఒకలా, కొంత విరామం తర్వాత ఒకలా కనిపించినట్లు వివిధ కోణాల్లో వివరిస్తాడు.

'గమనించము కానీ దీర్ఘ ప్రవాసం తరువాత ఇల్లు చేరినపుడు
ఇల్లు కూడా కాసేపు మనని అతిథిలా చూస్తుంది.
ఇంటిగోడలూ, వెలిసిన రంగులూ, ఇంటిలోని వస్తువులూ
ఇవాళ వాకిట్లో పూసిన పూలూ, మన మనుషుల మాటలూ
ఎవరీ మనిషని చూస్తున్నట్లూ, ఎవరినో పలకరిస్తున్నట్లూ వుంటాయి'

ఇది చిత్రమయిన అనుభవం. చాలా మందికి ఇట్లాంటి అనుభవాలుంటాయి. చదువుకోడానికి కొన్నేళ్ళపాటు వేరే వూరు వెళ్ళి, దేశం వచ్చి తిరిగి మన వూరిని చూడడానికి వస్తే పరిసరాలన్నీ వింతగా కనిపిస్తాయి. విచిత్రంగా కనిపిస్తాయి. ఎన్నో ఏళ్ళ తరువాత కలిసిన బాల్యమిత్రులు వాళ్ళేనా వీళ్ళు అనిపిస్తారు. తెలియని తెరలేవో విడదీయలేని పొరల్లా విచ్చుకుంటాయి. అట్లా సొంతయిల్లు కూడా అతిథిలా చూస్తుందట. పరిసరాలన్నీ అపరిచితుణ్ణి పలకరిస్తున్నట్లుంటాయట. సున్నిత హృదయానికి సన్నజాజిరేకు కూడా బాకులా గుచ్చుకుంటుంది.

ఒక ప్రాచీనత, ఒక నవ్యత, సరిహద్దులులేని సమ్మేళనంలో సంగీతంలా కలిసి పోయిన సమన్వయమేదో ఓదారుస్తుంది.

'గమనించము కానీ, గాఢమైన నిద్రనుండి మేల్కొన్నపుడు కూడా
మనచుట్టూ వున్న ప్రపంచం అప్పుడే పుట్టినట్లుంటుంది.
ఆ క్షణమే ఎవరో ప్రపంచాన్ని తెచ్చి పరిచినట్లుంటుంది
అప్పుడు, తాజాగాలులు మొదటి శ్వాసలా దేహం నిండా వ్యాపిస్తాయి'

కవి ముందుకొచ్చి తాత్వికుడు వెనక్కి వెళ్ళినపుడు ప్రసాద్ ప్రపంచాన్నికూడా పున:సృష్టిస్తాడు. పసిపాపను చేస్తాడు. అప్పుడు, ఎన్నో ఏళ్ళ తర్వాత తన పరిసరాల్ని దర్శించినపుడు ఎవరో ప్రపంచాన్ని తెచ్చి పరిచినట్లుంటుందంటాడు. తాజాగాలి మొదటి శ్వాసలా తన్మయపరచిందట.

తాత్వికత, కవిత్వమూ చెట్టాపట్టాలేసుకున్నపుడు అతని అభివ్యక్తిలో ఒక ఆనందం, దిగులు, కలిసిపోయినట్లు కనిపిస్తుంది.

'గమనించము కానీ ఇల్లూ, మెలకువా పాతబడే కొద్దీ
నెమ్మదిగా మనవాళ్ళూ, ప్రపంచమూ మనలో నిండేకొద్దీ
దేనినో కోల్పోతున్న దిగులొకటి
ఇసుకపొరలు దాటుకుంటూ వాననీరు పాతాళంలోకి ఇంకుతున్నట్లు
మనలోకి ఇంకుతూ వుంటుంది'

ఏదో కోల్పోతూ వుంటాం, ఏదో పొందుతూ వుంటాం. అందుకోవడం వెనక, చేజారడం వెనక దిగులు ఏదో కదుల్తుంది. పాతాళానికి ఇంకే నీరులా మన అంతరాంతరాల్లో దిగులు జలం వుంది. తవ్వేకొద్దీ ఆ దుఃఖాన్ని తలకెత్తుకోవచ్చు.



# స్త్రీ గురించి అపూర్వ భావన

స్త్రీ గురించి ప్రసాద్ అపూర్వంగా భావిస్తాడు. కవులు స్త్రీని వర్ణిస్తారు. ఆమె అందచందాలను ఆపాదమస్తకం వర్ణిస్తారు. మన ప్రాచీన కవులయితే చెప్పాల్సిన పన్లేదు. మన భావకవులు ఆమెను వూహా సుందరిగా మార్చేసారు.

'స్త్రీని అర్థం చేసుకోకూడదు. ఆమెను ప్రేమించాలి' అన్నాడు ఆస్కార్ వైల్డ్. ప్రసాద్ దృష్టి వేరు.

'వాళ్ళను చూస్తూనే వున్నాను
వాళ్ళ సమీపంలో పసివాడినవుతాను
కలలు మేల్కొన్న యువకుడినవుతాను
నిండైన నదిలాంటి పూర్ణ మానవుడినవుతాను' అంటాడు.

స్త్రీని చూసి అతను పసివాడవుతాడు, యువకుడవుతాడు. చివరగా పరిపూర్ణ మానవుడవుతాడట. కారణం స్త్రీలో పరిపూర్ణత వుంది. సమగ్రత వుంది. ఆమె ప్రకృతికి ప్రతిబింబం, ప్రతిరూపం. పురుషుడు ప్రశ్నలతో భూమిపై అడుగు పెడితే ఆమె సమాధానంతో జన్మించింది.

'మగువేగా మగవానికి మధురభావన' అన్నాడు శ్రీశ్రీ. 'నువ్వు నా చెల్లివి. తల్లివి, కౌగిలించుకున్న పెద్దపులివి' అన్నాడు తిలక్. ప్రసాద్‌ది ప్రత్యేకమైన దృష్టి.

'వాళ్ళని చూడడమెపుడూ ఆశ్చర్యంగానే వుంటుంది.
నేనీ మట్టి మనిషినైనట్టూ, వాళ్ళు ఏ కాంతినుండో వచ్చినట్టూ,
లేదూ, ఇది వాళ్ళ కాంతి లోకమైనట్టూ
నేను ఏ చీకటినుండో వాళ్ళకోసం వచ్చినట్టూ ఉంటుంది'

నిజమే కదా! స్త్రీలు ఎప్పటికీ ఆశ్చర్యాలే. ప్రపంచం ఇంత సజీవంగా వుండడానికి, సౌందర్యభరితంగా వుండడానికి స్త్రీలే కారణం. వాళ్ళు అంతుపట్టరు. కృష్ణశాస్త్రి అన్నట్టు 'ఆమె కన్నులలో అనంతాంబరపు నీలి నీడలు'ంటాయి. వాళ్ళలో ఆకాశమంత వైశాల్యం, సముద్రమంత గంభీరం వుంది.

వాళ్ళ కళ్ళలో ప్రేమ తొణికిసలాడుతుంది.

'వాళ్ళు నన్ను చూడడమెపుడూ ఆశ్చర్యంగానే వుంటుంది
అందమైన కల ఏదో అకస్మాత్తుగా జీవితంలో వాలినట్టూ,
బరువైన జీవితమేదో కలలాగా తేలిపోయినట్టూ వుంటుంది'

స్త్రీ ఒక స్వప్నం. ఆమె సమీపంలో వుంటే మనకు సన్నిహితంగా ఒక స్వప్నం వున్నట్టే. వాళ్ళ సామీప్యంలో జీవితం తేలికపడుతుంది. స్త్రీ సన్నిహితంగా వుంటే మనం ఒక అనిర్వచనీయ ఉద్వేగానికి లోనవుతామన్నాడు జర్మన్ కవి గోథె. ఆరాధనని అందంగా ఆవిష్కరించాడు ప్రసాద్.

జర్మన్ మహాకవి గోథె 'ఎప్పటికయినా ఈ ప్రపంచానికి విముక్తి కలిగించేది స్త్రీయే' అన్నాడు. అచ్చం అలాగే అచ్చమయిన మన తెలుగు కవి ప్రసాద్..

'ఎప్పటికయినా ఆమె మాత్రమే
ఆమెతో నిండిన మానవులు మాత్రమే లోకాన్ని నడిపించాలనీ
బలప్రదర్శనలతో విసిగివున్న ప్రపంచాన్ని
ఆమెలాంటి ప్రేమతో నింపాలనీ కలగంటాను' అంటాడు.

ప్రసాద్ శాంతిప్రియుడు. ప్రపంచం పరుగు పందానికి అందనంత దూరంలో వుంటాడు. స్త్రీలో శాంతగుణం, సహజ గుణం వున్నాయి. ఆమే ఎప్పటికయినా ప్రపంచానికి ఆదర్శం అంటున్నాడు.



# కవిని చూపించిన కవి

**'కవియై** పుట్టుట కన్నను ఘన మేమున్నది జగతిన్' అన్నాడు రాయప్రోలు. కవిత్వముంటే రాజ్యాలెందుకన్నాడు భర్తృహరి. ప్రసాద్ అంతటి సంపన్నుడు. అట్లాంటి ప్రసాద్ కవి గురించి ఓ కవిత రాశాడు.

కవి ప్రత్యేక లక్షణాలున్న వాడనుకుని అతన్ని చూడ్డానికి అతని యింటికి వస్తారట జనం. ఎన్నో వూహల్లో అతన్ని ఆదర్శమూర్తిగా భావించుకుని వస్తారట. 'దయగా, అందంగా, చురుకుగా ఉండి ఉంటాడని' 'లోపలి కవిని వెలుపల ధ్రువపరచుకోడానికి అతన్ని చూడ బోతా'రట. అయితే పరిస్థితి భిన్నంగా వుంటుంది.

'రోజూ చూసే ఇంటిలోని, వీధిలోని మనుషుల్లో ఒకడుగా వాళ్ళకి ఎదురవుతాడు. కాస్త నమ్రతా, గర్వం, మరికాస్త జాలీ, కోపం, కొంచెం లౌక్యం, కొంచెం భోళా. ఎపుడూ చూసే నమూనాల్లో ఒకడుగానే కవి వాళ్ళతో మాట్లాడతా'డట. 'ఇతనూ మనలాంటివాడే కదా అనుకుంటూ భ్రమలు చిట్లిన నవ్వొకటి నవ్వుకొంటార'ట.

'రాస్తున్నది ఇతను కాదు, ఏ దివ్య భావాలో వశపరచుకుని, వాహిక చేసుకొన్నాయని తాజా సమాధానంలోకి నిదానంగా తేటపడతార'ట.

నిజంగా చాలామంది కవుల్ని భరించలేం. వాళ్ళు చాలా సాదాసీదాగా వుంటారు. అంత గొప్ప కవిత్వం రాసిన వ్యక్తి ఇతనేనా అని ఆశ్చర్యపోతాం. సాధారణ మానవుల కన్నా యింకా కింది స్థాయిలో వుంటారు. ఓషో! "I love poetry, I hate poets" అన్నాడు. కారణం వాళ్ళ ప్రవర్తన!

కానీ ప్రసాద్ ప్రదర్శించిన కవి కరుణ నిండినవాడు, కవిత్వం జీవితంగా, జీవితం కవిత్వంగా వున్నవాడు.

అందుకే చూడవచ్చిన వాళ్ళకి వీడ్కోలు చెబుతూ, 'మీరు రావటం సంతోషం, మళ్ళీ కలుద్దాం' అంటున్నపుడు, అతని కళ్ళవంక ఎప్పుడూ చూడకండి. తనని చూడలేక పోయారన్న బెంగ వాటిలో ముసురుకొని వుంటుంది.

ఆ కళ్ళలో అనురాగం వుంది. ప్రపంచం పట్ల ప్రేమ వుంది. వాటిని వీళ్ళు చూడలేకపోయారు కదా, నా బాహ్యాన్ని మాత్రమే చూశారు కదా అనుకుంటాడు.

సాధారణంగా కవి కీర్తి ప్రతిష్ఠల్ని బట్టి అతని రూపాన్ని, ప్రవర్తనని వూహించుకుని కవుల్ని కలుస్తూవుంటారు. కవుల్లో ప్రచారరంగంలో వున్నవాళ్ళు కొందరే వుంటారు.

ఏ రంగంలో వున్నా అంతరంగంలో అనురాగం నిలుపుకున్న కవులు కొందరే వుంటారు. వైరముత్తు సుప్రసిద్ధ కవి, సినిమా కవి. తమిళ దేశంలో అభిమాన సంఘాలున్న కవి. ఆయన తనని చూడడానికి వచ్చినవాళ్ళను గురించి ఒక కవిత రాశారు. పొద్దున్న కొంతమంది ఆయన యింటికి వస్తారు. ప్రశ్నల వర్షం కురిపిస్తారు. ఆయన పాటకు ఎంత తీసుకుంటాడు అన్నది మొదలు ఆయనకు హీరోలతో సంబంధాలు, హీరోయిన్ల విషయాలు, ఆయన బలాలు, బలహీనతలు అన్నిటి గురించి ప్రశ్నిస్తారు. వాళ్ళు వెళ్ళిపోయాకా ఆయన గది నించి సన్నని రోదన వినిపిస్తుందట. వెళ్ళిచూస్తే అది 'ఆయన కవిత' అట. 'నా గురించి ఎవరూ అడగలేదే' అని ఏడుస్తోందట!

అట్లా తన అంతరాత్మని గ్రహించలేకపోయారన్న ఆవేదన ప్రసాద్ ఆవిష్కరించిన కవికి వుంది.



# కవిత్వం గురించి...

**ప్రసాద్** ఈ ప్రపంచానికి సంబంధించినవాడు కాదు. అతను ఏదో సత్యలోకవాసి. సౌందర్యలోకవాసి. బహుశా అతను శాపవశాత్తు ఈ భూమికి వచ్చినట్లనిపిస్తుంది. తన మెత్తని పదాలతో, సుతిమెత్తని కవితతో ఈ మొరటు ప్రపంచాన్ని స్పర్శిస్తాడు. తను సృష్టించిన కవిత్వాన్ని సమీపించడానికి మనిషికి కొన్ని అర్హతలుండాలంటాడు. అవి నియమాలు కావు. నిర్బంధాలు కావు. మనిషి లోపలి మంచితనంతో కవిత్వాన్ని సమీపించాలంటాడు. అది తన కవిత్వమయినా, ఇతరుల కవిత్వమయినా అందమయింది, అపూర్వమయింది. దాన్ని సమీపించడానికి ప్రేమవుండాలి, సహృదయత వుండాలి, సౌజన్యముండాలి అంటాడు.

'కవిత్వం చదవబోతున్నపుడైనా నీలో మెత్తదనం ఉండాలి
వెలితిగా వున్న ఆకాశం నిండా
మెలమెల్లగా విస్తరిస్తున్న మేఘంలాంటి దిగులుండాలి'

కారణం ఆయన కవిత్వం విప్లవాలకు సంబంధించింది కాదు. అది ప్రేమ అంతస్సారంగా కలిగింది. దయ అంతస్సారంగా కలిగింది. కాబట్టి మనలో మెత్తదనం వుండాలి. ఒక అనిర్వచనీయమైన దుఃఖం విస్తరిస్తున్న మేఘంలా వుండాలట!

ప్రసాద్ కవిత్వం చదివితే బైరాగి గుర్తుకొస్తాడు. అంతులేని దిగులును అంతరంగమంతా పరచుకున్న విలక్షణ కవి బైరాగి.

'నింగినించి నీలాలు కురిసేచోట
బంగరు వెలుగుల జాలు మెరిసే చోట
ప్రశ్నలు ప్రత్యుత్తరాలులేని శాంతిపద్మంలా విరిసే చోట
చంచువు తెరచి ఉలిపిరి తెమ్మెరలను పీలుస్తాను'

అంటూ శాంతికోసం తపిస్తాడు. అట్లాంటి శాంతి, ప్రేమల్నే ప్రసాద్ ఆకాంక్షిస్తాడు.

'కవిత్వాన్ని సమీపిస్తున్నపుడయినా
వానకాలువలో పరిగెత్తే కాగితం పడవలో ప్రయాణిస్తూ
సుదూర దేశాల మంత్ర నగరుల్ని ఊహించే
అమాయకత్వం నీలో మేలుకోవాలి'

కవిత్వాన్ని అంత స్వచ్ఛంగా పువ్వుని సమీపించినంత అనురాగంతో సమీపించాలంటున్నాడు. ప్రసాద్ భాష, సౌందర్య సౌకుమార్య, సంస్కారాల గుండా సాగి సంపూర్ణత్వాన్ని సంతరించుకుంది. సానబెట్టిన మెత్తదనం అతనిది. 'గోదావరీ పావనోదారవాఃపూరం' అతని వాక్యాల్లో ప్రవహిస్తుంది. అతని వాక్యాలు స్నేహలతల్లా మనసుల్ని అల్లుకుంటాయి. ఒక్క కఠినపదం కూడా లేకుండా పసివాడి చిరునవ్వులా మహామృదువుగా వుంటాయతని మాటలు.

ఇట్లాంటి కవి ఏం చేస్తాడు?

'కవి ఏమీ చెయ్యడు.
కన్నీటిలోకో, తెలియని లోకాలపై బెంగపుట్టించే సౌందర్యంలోకో,
తను చూసిన దారిలోకి ఆహ్వానించటం మినహా
కవి నిన్ను పిలిచినపుడైనా
మగత నిదురలోంచి జీవించటంలోకి చకచకా నడిచివెళ్ళాలి'

ప్రసాద్ సౌందర్యజీవి. స్వప్నలోక సంచారి. అజ్ఞాత లోకాల్ని అన్వేషించేవాడు. ఈ ప్రాపంచిక పరిధుల్ని దాటి తను సృష్టించిన మహా విశాల కవిత్వ లోకంలోకి రమ్మంటున్నాడు. అక్కడ అందర్నీ దగ్గరికి చేర్చే రసాయనముందంటున్నాడు. ఆ అమృత సేవనతో అందరూ అమరులవుతారంటున్నాడు.



# ఉన్నత స్థాయిలోని సున్నితత్వం

**మనం** గుడిలోకి దైవదర్శనం చేసుకోవడానికి పరిశుభ్రంగా తయారయి, తాజాగా వున్న పూలతో, భక్తిభావంతో వెళతాం. మన అహంకారాన్ని పక్కనపెట్టి ఆత్మ సమర్పణ భావంతో వుంటాం. బివివి ప్రసాద్ కవితల్ని సమీపించడానికి, స్పర్శించడానికి, స్మరించ డానికి మనకు అట్లాంటి స్థితి అవసరం. కారణం ఆ కవితలు ఆకాశంలోంచి భూమికి జారిన పూలు. ఒక్క అహంకారం నిండిన చూపుకు కూడా అవి అదృశ్యమయిపోతాయి. ఆయన కవితలు చివురుటాకులు, చిన్నిపాపలు, సెలయేళ్ళు, శాంతిదూతలు.

'తెల్లకాగితంపైకి రంగులు వాలినట్లు
నీ ప్రశాంతతలోకి
ఏవో మృదువయిన స్పందనలు వచ్చి వాలతాయి'

అతని కవితలు నిర్మల సరస్సులో కళకళలాడే కల్హారాలు. అందాన్ని, అనురాగాన్ని ఆహ్లాదాన్ని ఇచ్చేవి. అతని స్పందనలు పావురాలు. అయితే 'అవి ఎగిరేందుకు పుట్టినవి కావు, వాలేందుకే లోకంలోకి వచ్చా'యంటున్నాడు. వాటి విలక్షణ తత్వాన్ని వివరిస్తూ..

'ఈ పావురాలు అందుకే వస్తాయి
ఇవి నిశ్శబ్దాన్ని విప్పి శబ్దాలు వెదజల్లవు
శబ్దాలను విప్పి నిశ్శబ్దాన్ని పంచిపెడతాయి'

పల్చటి తామరాకు మనముఖానికి కప్పుకుంటే ఎంత చల్లగా వుంటుందో ఆయన వాక్యాల్ని మనం చదువుతూ వుంటే వేడెక్కిన మన మనసులోకి మంచుబిందువులు రాలి

నట్లనిపిస్తుంది. మనందరిలో శబ్దాలమధ్య నిశ్శబ్దం వుంది. ఆ నిశ్శబ్దంలో శాంతి వుంది. ఆ శాంతి సందేశాలే ప్రసాద్ కవితలు.

ప్రసాద్‌కు ప్రతిదీ అద్భుతమే. నీడలో కూడా ఏదో ఓదార్పును దర్శిస్తాడు.

'ఈ మధ్యాహ్నం నిదానంగా విస్తరించే నీడని చూస్తున్నపుడు
దయాగుణమేదో కవిత్వంలా మెల్లగా కనులు విప్పుతోంది'

నీడలోనే తోడునిచ్చే లక్షణముంది. ప్రాచీన ఈజిప్షియన్ శిల్పాల్లో ఏదో నీడ నిక్షిప్తమయినట్లు మన మనసున ఒక చల్లదనం కనిపిస్తుంది. ఆ శిల్పాల్లో అహంకారం కనిపించదు. దయాగుణం కనిపిస్తుంది. మధ్యాహ్నపు నీడలో కలాన్ని అద్ది కవితలు రాసే ప్రసాద్‌లోనూ దయాగుణముంది.

ప్రసాద్ గంధర్వలోకం నించి వచ్చినవాడు. తనకే తెలియని ఆ విషయాన్ని కవితలో ఆవిష్కరించాడు.

'చుట్టూవున్న శూన్యంలోపలి లోకంలోంచి మెరిసే జీవి ఒకడు మనకోసం వస్తాడు
అతన్ని భూమి గుర్తించదు, భూమి మేలుకొంటున్న పరిమళం గుర్తిస్తుంది.
అగ్ని గుర్తించదు, అగ్నినుండి రెక్కలు విప్పుకొనే రంగులు గుర్తిస్తాయి
అక్షరాలు గుర్తించవు, వాటిపై అదృశ్యంగా సంచరించే ఊహలు గుర్తిస్తాయి'

ప్రసాద్ ప్రకృతి సారాంశం. భౌతికంగా మనకు కనిపించే ప్రతి అంశంలోనూ, దృశ్యంలోనూ కనిపించని ఒక స్పందన వుంటుంది. అతను ఆ స్పందనకు ప్రతినిధి. సారాంశం ఏమిటంటే అతను అనుభూతికి ప్రతిరూపం.

అతని కవిత్వం వేరు, అతను వేరు కాదు, అతను అతని కవిత్వంలాగే నిర్మలమైన వాడు. అవి పదాలు.. ప్రశాంతి దీపాలు.. మౌనరూపాలు..!



# దిగులు దారంతో అల్లిన పూలదండలు

**ప్రసాద్** కవితల్లో దిగులు వుంది. అందాన్ని అపూర్వంగా అందిస్తాడు. సౌందర్యాన్ని దర్శిస్తాడు. ప్రపంచంపట్ల ప్రతిదానికీ ప్రతిస్పందిస్తాడు. కానీ అంతస్సూత్రంగా అంతులేని, కాదు, అంతుపట్టని విషాద ఛాయ అతని కవితల్లో వుంది. దాదాపు అతని కవితలన్నీ దిగులు దారంతో అల్లిన పూలదండలే.

ప్రపంచం మనకోసం పరిచిన పచ్చని తివాచీ అనుకునే నవనవ యవ్వనం నాటి నించీ ఈనాటి యాభయి సంవత్సరాల ప్రసాద్ వరకూ ఆ తాత్విక చింతన వుంది. ప్రపంచాన్ని దాటిన ఆలోచనల ప్రకంపనలు అతని కవితలన్నిటా వున్నాయి.

'కనులంటే ఏమిటో, చూడడమంటే ఏమిటో

చూపు బయలుదేరే లోలోపల శూన్యపు అగాధమేమిటో

ఎరుక లేకుండానే ఋతువుల నీడల్లో తడుముకొంటున్నాం కదా'

చూపుని, కళ్ళను దాటి లోలోపలి అగాథాల్లో, అంతుపట్టని లోలోతుల్లో మునక లేస్తాడు. నీడల్లో తడుముకుంటున్నా మంటాడు.

మనకు తెలియని గాయమేదో మన మనసుకు తెలియని, మన వూహకందని గాయమేదో అతనిలో వుంది. అది ఎపుడో వూహ తెలియని రోజుల్లో అతన్ని తాకినట్లుంది. అది ఒక మాట కావచ్చు. అనుభవం కావచ్చు. మొత్తానికి అది అతన్నీలోకం నించి వేరు చేసింది. అంతర్దృష్టి నిచ్చింది. అంతుపట్టని దుఃఖంతో అతన్ని ఆలింగనం చేసుకుంది.

అన్నీ ప్రవాహంలా సాగిపోతూ వుండాలి. ఆగిన వేవయినా ఆందోళనా కారకాలే అంటాడు.

'వేటినీ వెళ్ళనివ్వం కనుకనే

మన చుట్టూ ఎడారుల్ని కావలి కాస్తున్న దిగులు

మన ముఖాలపై చీకట్లను దాచే వెల్తురులాంటి నవ్వులు'

ఒక సంఘటనలో, దృశ్యంలో లీనమయినవాడు తను అదృశ్యమవుతాడు. ప్రసాద్ అన్నిట్లో అడుగుపెడతాడు. కానీ అన్నిట్నీ అతీతంగా చూస్తాడు. కానీ ప్రతిదాని ఆంతర్యాన్ని పసికడతాడు.

ఈ ప్రపంచమనుకునే ఆనందాలు, ఈ మనుషులనుకునే స్వేచ్ఛ నిజమైనవి కావంటాడు.

❀ ❀ ❀

# అంతులేని అగాథాల అన్వేషి

**ప్రసాద్‌కు** జననమూ తెలుసు. మరణమూ తెలుసు. జననమరణాతీత స్థితీ తెలుసు. అతను తాత్విక తన్మయుడు. మనకు తెలియని మార్మికలోకాల్లో మందహాసంతో తిరిగే మనీషి. దృశ్యాల్ని సృష్టిస్తాడు. దృశ్యాల్ని మాయం చేస్తాడు. దూరాల్ని దగ్గర చేయగలడు. దగ్గర్లని దూరం చేయగలడు. అతని దగ్గర ఇంద్రజాలముంది. కానీ అది దిగులు రంగుల్ని పులుముకున్నది.

'దృశ్యాలు ఆనందాన్నిస్తాయి కాని
మరింత లోతైన ప్రశ్నల కిరణాలు ప్రకాశిస్తే
అవి పొగమంచులా మాయమవుతాయి'
'దృశ్యాలు బాధ కలిగిస్తాయి కాని
మరింత సున్నితమైన ప్రేమలోకి కనులు తెరిస్తే
అవి దయగా నిన్ను విడిచి వెళతాయి'

ప్రసాద్ దగ్గర దయాదండముంది.దాంతో ఎంత కాఠిన్యాన్నయినా మంచుగడ్డలా కరిగించేస్తాడు. మనకు ఆనందకరమయిన దృశ్యం వుంటుంది. సునిశిత దృష్టితో దాని అంతర్యంలోకి వెళితే అది మంచులా మాయమవుతుంది. మనకు బాధ కలిగించే దృశ్యాన్ని కూడా ప్రేమతో చూస్తే మాయమవుతుందట. అతనిది 'సుఖదుఃఖాధిక ద్వంద్వాతీత దృష్టి'.

ఉమర్ ఖయామ్‌లాగా ప్రసాద్ తత్వవేత్త. దువ్వూరి రామిరెడ్డిగారు పానశాలలో..

"నేనొక తత్త్వవేత్తనని నిందయొనర్చిరి కానివారు. నా
మానసవృత్తి వారలణుమాత్ర మెరింగిన నట్టులందురే?
కాని మరేమీ దేవుడెరుంగడె మనంబు, వ్యథాకులాయమౌ
ఈ నిలయంబు చేరితి, గ్రహింప నసాధ్యము జన్మమర్మముల్" అన్నారు.

ప్రసాద్ ఉమర్‌ఖయామ్ లాగే కేవల తత్త్వవేత్త మాత్రమే కాడు. నిలువెల్లా కవి, నిలువెత్తు కవి. జన్మమర్మాల్ని తెలుసుకోవడం అసాధ్యమని గ్రహించినవాడు. ప్రసాద్‌కు దగ్గరగా వున్న కవులు బైరాగి, ఉమర్ ఖయ్యాం.

తెలుగులో ప్రస్తుతం వున్న బలమైన తాత్త్వికకవి ప్రసాద్ లోపలికి చూసుకునే వాళ్ళకు లోతయిన రహస్యాలు తెలుస్తాయి.

మనసు లోలోపల మహా కేంద్రముంది. ఆ కేంద్రాన్ని చేరడం ప్రసాద్‌కు తెలుసు.

'మరింత లోతైన శ్వాసలోకి
నీ జీవితపు వేర్లు ప్రవేశించినపుడు
ఏ చిరుగాలీ ఇక చలింపచేయదు
ఏ పెనుగాలీ కదిలించలేదు'

ఈ సమస్యలు, సంఘర్షణలు, అనుబంధాలు, అందాలు, సుఖదుఃఖాలు, ఈ ప్రపంచం, జనన మరణాలు వీటన్నిటిని దాటిన ఒక విశ్వకేంద్రం వుంది. అది నీలో వుంది. నాలో వుంది. ఆ కేంద్రాన్ని చేరినపుడు ఇవేవీ మనల్ని కదిలించలేవు. అది అనంత స్వేచ్ఛకు ఆస్కారమిస్తుంది.

'నీ చుట్టూ ఏదీ లేని స్వేచ్ఛ
నువ్వు ఏదీ కాని స్వేచ్ఛ
అంతకన్నా రసమేది, సౌందర్యమేది
అంతకన్నా ధైర్యమేది, శక్తియేది'

అట్లాంటి అతీత మానస స్థితిలో అజేయ, అప్రమేయ, మహానంద స్థితి వుంది. అది అందుకోవడానికి అందరూ ప్రయత్నించాలి.



# బివివి ప్రసాద్ బయోడేటా

| | |
|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ |
| పుట్టినతేదీ | : 21. 11. 1966 |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి |

| | | | |
|---|---|---|---|
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | 1989 |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | 1995 |
| | హైకూ | (హైకూలు) | 1997 |
| | పూలురాలాయి | (హైకూలు) | 1999 |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | 2006 |
| | ఆకాశం | (వచన కవిత్వం) | 2011 |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | 2015 |

| | | |
|---|---|---|
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | 2004 |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | 2012 |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | 2011 |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | 2011 |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | 2011 |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | 2015 |
| | తిలక్ అవార్డు, తణుకు | 2016 |


| | |
|---|---|
| చిరునామా | : బివివి ప్రసాద్, # 23-12-21, సజ్జాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ 534 211 |
| ఫోన్ | : 90320 75415 |
| ఈ మెయిల్ | : prasadbvv1@gmail.com |
| బ్లాగ్ | : bvvprasad.blogspot.in |

# సౌభాగ్య ఇతర రచనలు

## కవిత్వం

1. సంధ్యాబీభత్సం
2. కృత్యాద్యవస్థ
3. సింహావలోకనం
4. పునరుత్థానం
5. రెండు దశాబ్దాలు
6. ప్రేమ కవితలు
7. యాభయి దాటిన యవ్వనం
8. సౌభాగ్య కవిత
9. సౌభాగ్య సమగ్ర కవిత

## ఇతరాలు

10. నేటి విమర్శ (సం)
11. సమకాలీనం (సం)
12. సాహిత్య వ్యాసాలు – సమీక్షలు
13. వ్యాసాలు – ద్వేషాలు
14. ఈ కాలం కవులు
15. శిఖామణి కవిత్వం
16. ఆశారాజు కవితా వైభవం
17. బహుత్‌ఖూబ్ యాకూబ్
18. జీవన దార్శనికుడు వేంపల్లి షరీఫ్
19. కె.యస్.రమణ అనుభవాంతరంగం
20. సున్నితమైన కవి – సుమనశ్రీ
21. కందుకూరు శ్రీరాములు కవిత్వజీవనది
22. ఆస్కార్ వైల్డ్ ఆలోచనలు
23. అద్భుత జెన్ కథలు
24. తావో తరంగాలు
25. పాశ్చాత్య సంగీతకారుల జీవితాలు
26. సుప్రసిద్ధ శృంగార జీవితాలు
27. నిత్య జీవితంలో ధ్యానం
28. రోమన్ మేధావుల ఆలోచనలు
29. ఫ్రెంచి కవులు – విమర్శకులు
30. గొథె ఆలోచనలు
31. ప్రపంచ ప్రసిద్ధ జోక్స్
32. దేశదేశాల జోక్స్
33. వివేక కథలు
34. మంచి మంచి కథలు
35. బౌద్ధ కథలు
36. జపాన్ కథలు
37. తావోతత్వం
38. జిడ్డు కృష్ణమూర్తి ఆలోచనలు
39. వివేకానికి వెయ్యి మార్గాలు

## ఓషో

40. ఓషో కథలు
41. ధ్యాన రహస్యాలు
42. నేను ప్రేమించిన పుస్తకాలు
43. పిచ్చివాడి రాతలు
44. నిద్రకు ముందు నిర్మల ధ్యానాలు
45. మాటల్లేని మాటలు
46. ఆణిముత్యాలు
47. మరణం ఒక భ్రాంతి
48. ఇండియా నా ప్రాణం
49. ఆత్మకు ఔషధం

## అరవయ్యో ఏట ఆవిష్కరింపబడిన గ్రంథాలు

50. ఆధునిక ఇటలీ కవులు
51. అంతా ప్రేమ గురించే
52. చింతన
53. సిసిరో ఆలోచనలు

54. దమ్మపదం
55. దేశదేశాల సామెతలు
56. ఇవన్నీ నిజాలే
57. జర్మన్ మహాకవి గొథె జీవితం
58. ఐన్‌స్టీన్ అపూర్వ ఆలోచనలు
59. జాన్ కీట్స్
60. మేధావుల ఆలోచనలు
61. ప్రసిద్ధుల చమత్కారాలు
62. సూఫీ కథలు
63. విమర్శ – పరామర్శ
64. భర్తృహరి సుభాషితాలు
65. రస్సెల్ ఆలోచనలు
66. డాస్టయేవ్‌స్కీ ఆలోచనలు
67. గ్రీకు రోమన్ కథలు
68. ఖలీల్ జీబ్రాన్ కథలు
69. ప్రసిద్ధ ఉర్దూ కవులు
70. ప్రేమ – ప్రేమ – ప్రేమ
71. రష్యన్ మేధావుల ఆలోచనలు
72. సెక్స్ ఆచారాలు – సంప్రదాయాలు
73. తావో – తె – చాంగ్
74. టిబెట్ జానపద కథలు
75. దేశ దేశాల తుగ్లక్ చట్టాలు
76. వింతలు – విశేషాలు
77. జెన్ హితోక్తులు
78. జెన్‌తత్వం
79. పాశ్చాత్య చిత్రకారుల జీవితాలు
80. అద్భుత ఆధ్యాత్మిక కథలు
81. కేరళ & అస్సాం జానపద కథలు
82. యూదుల కథలు
83. బెంగాల్ జానపద కథలు
84. గుజరాత్ జానపద కథలు
85. హర్యానా జానపద కథలు
86. హిమాచల్ ప్రదేశ్ జానపద కథలు
87. కాశ్మీర్ జానపద కథలు
88. మధ్య ప్రదేశ్ జానపద కథలు
89. రాజస్థాన్ జానపద కథలు
90. సంతాల్ జానపద కథలు
91. ఉత్తర ప్రదేశ్ జానపద కథలు
92. ఆధునిక ప్రపంచ కవులు
93. 20వ శతాబ్దం ఇంగ్లీషు కవులు
94. ఆధునిక జపాన్ కవిత
95. అసాధారణ ప్రేమ కవితలు
96. కంప్యూటర్ జోక్స్
97. ఫేస్‌బుక్ జోక్స్
98. నెరుడా, రింబో కవితలు
99. హాలీవుడ్ హాస్యం
100. జర నవ్వండి ప్లీజ్
101. పెద్దలకు మాత్రమే జోక్స్
102. సమకాలీన ప్రపంచ కవులు
103. ఆధునిక ప్రపంచ కవులు
104. వైరముత్తు కవిత్వం
105. వైఫై జోక్స్
106. యూదుల జోక్స్
107. ప్రాపర్టియస్ కవిత
108. సాత్విక భావాల సౌందర్యశిల్పి దాట్ల దేవదానం రాజు

## కవులపై గ్రంథాలు

109. శిలాలోలిత కవిత్వం
110. ప్రసాద మూర్తి కవిత
111. పెద్దిపెడ్డి గణేష్ కవిత్వం
112. రామాచంద్రమౌళి కవిత్వ విశ్లేషణ
113. యార్లగడ్డ రాఘవేంద్రరావు
114. తనికెళ్ళ భరణి కవిత్వం
115. కొండేపూడి నిర్మల కవిత్వం.



taatvikabhaavaala tanmayatvam
bvv prasad kavitvam
sowbhagya

పువ్వూ, కవీ మాయమయితే సౌందర్యమంటున్నాడు ఈ మార్మిక కవి.

ప్రసాద్ అలౌకికానికి, లోకానికి వంతెన కట్టే కవి.

కొన్ని వూహాలు కొంతమందే చేయుగలరు. అట్లాంటి అపూర్వమైన వూహాలు వాళ్ళు ఎలా చెయ్యగలరా? అని మనం ఆశ్చర్యపోతాం. అంత సున్నితంగా, అంత సుందరంగా ప్రసాద్ ఊహిస్తాడు. ఊహాకు అందని వూహాలు చేస్తాడు.

తన సహృదయుతని, సౌమనస్యాన్ని, తను గ్రహించే సౌందర్యాన్ని అందర్తో పంచుకోవాలనుకుంటాడు ప్రసాద్. ఆయున దగ్గర అంతులేని భావనా ప్రపంచముంది. అందులో మనందర్నీ విహరించమంటాడు. విశ్రాంతి తీసుకోమంటాడు.